# దేవుని గుర్తు - 963

భగవద్గీత అ.15-శ్లో॥16,17

# మాయ గుర్తు - 666

భగవద్గీత అ.16-శ్లో॥14



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# దేవుని గుర్తు-963

భగవద్గీత అ.15-శ్లో॥ 16, 17

# మాయ గుర్తు-666

భగవద్గీత అ.16-శ్లో॥ 14


రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

## ఇందూ జ్ఞానవేదిక

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-39 తృతీయ ముద్రణ : ఆగష్టు-2017



ప్రతులు : 1000 వెల : **70 /-**



01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు–దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము–భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము–పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు–963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు–ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు–వర్తకుడు.
63) ధర్మము–అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము–ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.

78) సాయిబాబా దేవుడా! కాదా?

79) లు అంటే ఏమిటి? (తెలుగు)

80) చెట్టుముందా! విత్తుముందా?

81) గీతం-గీత (పాటల జ్ఞానము).

82) మరణము తర్వాత జీవితము.

83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.

84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.

85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.

86) ఒక మాట మూడు గ్రంథములు.

87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.

88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?

89) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.

90) ఏది సత్యము-ఏది అసత్యము.

91) ఒక వ్యక్తి రెండు కోణములు.

92) సుప్రసిద్ధి బోధ.

93) మానవత్వము.

94) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

95) యోహాను చెప్పిన జ్ఞానము.

96) రాజకీయము×రాజకీయము.

97) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

98) రూపము మారిన గీత.

99) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము
125. అక్షర జ్ఞానము
126. లలా జలము
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా





### ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# దేవుని గుర్తు-963

భగవద్గీత అ.15-శ్లో॥16,17

# మాయ గుర్తు-666

భగవద్గీత అ.16-శ్లో॥14

ఇప్పుడు కనిపించు ఈ విశ్వమంతయూ ఒకప్పుడు లేదు. ఈ విశ్వమంతయూ లేనపుడు కూడా ఒకటి మిగిలియున్నది, అదియే దేవుడు. పైన ఆకాశముగానీ, క్రింద భూమిగానీ, మధ్యలో గాలిగానీ, అగ్నిగానీ, నీరుగానీ, ఏ జీవరాసిగానీ లేనటువంటి సమయములో దేవుడు పంచ భూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమిగల ప్రపంచమునూ, సకల జీవరాసులుగల జగతిని తయారు చేయాలనుకొన్నాడు. ప్రపంచము+ జగతి=విశ్వము. జీవరాసిలేని ప్రపంచమునూ, జీవరాసిగల జగతిని రెండిటినీ కలిపి చెప్పు పదమును విశ్వము అంటాము. విశ్వము లేని సమయములోనున్న దేవుడు పురుషుడుకాదు, స్త్రీయుకాదు, నపుంసకుడు అంతకూకాదు. రూపముగానీ, పేరుగానీ లేనివాడు దేవుడు. దేవుడు ఎటువంటి లింగభేదము లేనివాడు. అటువంటి దేవునినుండి విశ్వమును సృష్ఠించాలను సంకల్పము వచ్చినపుడు మొదట తననుండి రెండు భాగములను తయారు చేశాడు. ఆ రెండు భాగములను కూడా రెండుదఫాలుగా సృష్ఠించాడు. దేవుడు తయారుచేసిన రెండు భాగములను ఒక్కమారు తయారు చేయకుండా, రెండుమార్లు ఎందుకు తయారు చేశాడనగా? రెండు భాగములలో ఒకటి స్త్రీతత్త్వముకాగా, రెండవది పురుషసంబంధమైనది. మొదట స్త్రీతత్త్వమైన ప్రకృతిని తననుండి దేవుడు తయారుచేశాడు. ఎపుడైతే స్త్రీతత్త్వమైన ప్రకృతిని తయారుచేశాడో దానికి అదిపత్యము వహించుటకు తాను పురుషుడైనాడు. ప్రకృతి తయారు కాకముందు స్త్రీ, పురుషుడుకాని దేవుడు ప్రకృతి తయారైన తర్వాత ప్రకృతి

స్త్రీస్వభావము కలిగియుండగా, దేవుడు పురుష స్వభావము గలవాడైనాడు. ప్రకృతిని భరించువాడు దేవుడు, కనుక ఆయనను ప్రకృతికి భర్త అని చెప్పడము జరిగినది. దేవుడు భర్తకాగా దేవుని వలన భరింపబడు ప్రకృతి భార్య అయినది. దీనిప్రకారము దేవుడూ ప్రకృతీ ఇద్దరూ పతి సతులుగా ఉన్నారని తెలియుచున్నది.

దేవుడు మొదట స్త్రీతత్త్వమైన ప్రకృతిని తయారుచేసి, తర్వాత రెండవమారు పురుషతత్త్వమైన ఆత్మను తయారుచేశాడు. ఆత్మ తయారైన తర్వాత ఆత్మకంటే వేరైనవాడు దేవుడు కనుక దేవునికి పరమాత్మయని కూడా గుర్తింపు కల్గినది. దేవుడు మొదట స్త్రీ భావమున్న ప్రకృతిని సృష్టించి తర్వాత పురుష భావమున్న ఆత్మను సృష్టించాడనుకొన్నాము కదా! స్త్రీ పురుషసంబంధమైన ప్రకృతి, ఆత్మలనే కాకుండా రెండిటికీ తప్పిన నపుంసకున్ని తయారు చేయాలనుకొన్నాడు. వెంటనే జీవాత్మను ఆత్మనుండి బయల్పడునట్లు చేశాడు. ఇటు ప్రకృతినీ, అటు ఆత్మను తయారుచేసిన దేవుడు మధ్యలో జీవాత్మను కూడా చేయడమైనది. వివరముగా చెప్పుకోవాలంటే ఇటు స్త్రీనీ, అటు పురుషున్నీ తయారు చేసిన దేవుడు మధ్యలో నపుంసకున్ని తయారు చేశాడనుకోవాలి. ఆత్మనుండి మరొక జీవాత్మను సృష్టించినపుడు ప్రకృతిని కూడా ఐదుభాగములవునట్లు చేశాడు. ఆ ఐదు భాగములు 1) ఆకాశము 2) గాలి 3) అగ్ని 4) నీరు 5) భూమి అని తెలియుచున్నది. దీనిని ప్రకృతి సంబంధ పంచభూతములను ప్రపంచము అంటున్నాము. ఈ ప్రపంచములో ఆత్మ జీవాత్మలు రెండిటిని జగతిగ దేవుడు తయారు చేశాడు. ప్రకృతిని భరించువాడు పరమాత్మ (దేవుడు) కాగా, జీవాత్మను భరించువాడు ఆత్మ. పంచభూతముల వలన మనిషి శరీరము తయారుకాగ ఆత్మ జీవాత్మలు ఆ శరీరములో నివశిస్తున్నవి. ఇదే విధానము అన్ని జీవరాసులకు వర్తిస్తున్నది.

పురుషునిగా పరమాత్మ, స్త్రీగా ప్రకృతి ఉన్నదనుకొన్నాము కదా! ప్రకృతి శరీరములో నివశించు సగము పురుషుడు, సగము స్త్రీ అయిన జీవాత్మ అటు ప్రకృతివైపు పోతుందా ఇటు పరమాత్మవైపు పోతుందా అన్నదే ఇక్కడ ముఖ్యమైన పని. జీవుడు పూర్తి ఆడ మగ కాని మధ్యరకము వాడు కనుక పూర్తి తనవైపు లాగుకొనుటకు ప్రకృతి ప్రయత్నించుచుండును. అలాగే పూర్తి తనవైపు లాగుకొనుటకు ఆత్మ కూడా ప్రయత్నించుచుండును. జీవున్ని తనవైపు లాగుకొనుటకు ప్రకృతికి 'గుణములు' అను ఆకర్షణ గలదు. గుణములనే 'మాయ' అంటున్నాము. అలాగే జీవున్ని ఆత్మ తనవైపు లాగుకొనుటకు ఆత్మకు 'ఆత్మజ్ఞానము' అను ఆకర్షణ గలదు. ఇటు మాయకు, అటు ఆత్మజ్ఞానమునకు మధ్యనున్న జీవాత్మ తను ఎటు పోయేది తన ఇష్టము మీద ఆధారపడియుండును. జీవుడు ఇటు మాయవైపు పోతాడా! అటు ఆత్మవైపు పోతాడా! అని వినోదము దేవుడు చూస్తున్నాడు. మాయవైపు పోయినవాడు ప్రకృతిలోనికీ, ఆత్మజ్ఞానమువైపు పోయినవాడు పరమాత్మ లోనికి చేరిపోతాడు. మాయవైపు పోవువానిని మాయకు (ప్రకృతికి) గుర్తుగా ఆరువందల అరువది ఆరు (666) అను సంఖ్యను, ఆత్మవైపు పోవువానిని జ్ఞానమునకు (దేవునికి) గుర్తుగ 963 అను సంఖ్యను గుర్తించుకొన్నాము. దేవుని గుర్తుగ 963 సంఖ్యను ఎందుకు పెట్టుకొన్నదీ, అలాగే మాయకు గుర్తుగ 666 సంఖ్యను ఎందుకు పెట్టుకొన్నదీ తెలియజేయునదే ఈ చిన్ని గ్రంథము.

సర్వజీవరాసులకు తల్లి ప్రకృతిగా, తండ్రి పరమాత్మగా ఉన్నాడని భగవద్గీతలో కూడా చెప్పబడినది. తండ్రి బీజదాతకాగా, తల్లి శరీరము దాత అవుచున్నది. ఒక మనిషికి తల్లీతండ్రీ ఇద్దరు సమానమే, అందువలన ప్రకృతికి సూచించిన 666 గానీ, పరమాత్మకు సూచించిన 963 గానీ కూడితే రెండు సమానమైన 18 సంఖ్యనే వస్తున్నవి. ఇంతవరకు ప్రకృతిని

గురించి, పరమాత్మను గురించి, జీవాత్మ ఆత్మ మాయను గురించి కొంత తెలుసుకొన్నాము. దేవుని సంబంధ సంఖ్య 963 గానే ఎందుకున్నది? అను విషయమునూ, అట్లే మాయ సంబంధ సంఖ్య 666 గానే ఎందుకున్నదను విషయమునూ పూర్తి వివరముగా తెలుసుకొందాము.

సృష్ఠి అనగా తయారు చేయబడినదని అర్థము. ఇపుడు కనిపించు ఈ విశ్వమంతయూ ఒకప్పుడు తయారు చేయబడినదే. ఒకప్పుడు లేనిది ఏదైనా తర్వాత ఉంటే అది సృష్ఠించబడినదని అర్థము. ఒకప్పుడులేని పాత్రను ఒక మనిషి తయారు చేయుట అందరికి తెలిసిన విషయమే. లేని పాత్రను తయారు చేసి పెట్టినవానిని సృష్ఠికర్తని అంటున్నాము. మొదట లేనిదానిని దేనినైన నిర్మించినా లేక తయారుచేసినా వానిని 'సృష్ఠికర్త' అను సూత్రము ప్రకారము, మొదటలేని ఈ విశ్వమునంతటినీ తయారు చేసిన వానిని 'సృష్ఠికర్త' అని అంటున్నాము. ఇపుడు సృష్ఠికర్తలు రెండు విధములుగా ఉన్నారని కూడా చెప్పుకోవచ్చును. అదెలా అనగా! ముందు ఏమీలేనపుడు ఎవరికీ తెలియని విధానముతో పంచభూతములైన ప్రపంచమును, జీవశక్తితో కూడుకొన్న శరీరముల జగతిని, ప్రపంచమును జగతిని కలిగిన మొత్తము విశ్వమును తయారు చేయడము ఒక విధముగా ఉన్నది. ముందే తయారైన పంచభూతములనుండి ప్రత్యేకమైన యంత్రమునో, వస్తువునో, పదార్థమునో తయారు చేయడము మరొక విధానముగా ఉన్నది. రెండు విధానములలో, ఏమీ లేనపుడు ఏ ఆధారము, ఏ సూత్రము లేకుండా తయారుచేసిన సృష్ఠికర్త ఒకడుకాగా, అన్నీ ఉన్నపుడు వాటినుండి వాటి ఆధారముతో ఒక సూత్రమునను సరించి తయారు చేసిన సృష్ఠికర్త రెండవవాడు. ఏ ఆధారము ఏ సూత్రము లేకుండా జీవరూప ప్రపంచమునే తయారు చేసినవాడు ఎవడో వాని పేరేమిటో మనకు తెలియదనే చెప్పాలి. పదార్థముల ఆధారముతో సూత్రము ప్రకారము జీవరహిత యంత్రమును

తయారు చేసినవాడు మనిషియని అందరూ చెప్పగలరు. ప్రపంచములో ఒక యంత్రమును చేసిన వానిని వెదికి పట్టుకోవచ్చును, వానిపేరు ఫలానా అని చెప్పవచ్చును. కానీ జగత్తు, ప్రపంచము మిళితముగనున్న విశ్వమును తయారు చేసినవానిని వెదకి ఎవరూ పట్టుకోలేరు, వాని పేరు ఫలానా అని ఎవరూ చెప్పనూలేరు. విశ్వమును సృష్ఠించిన వానిని తెలుసుకోవాలంటే ఎంత కాలము వెదకినా వాడు తెలిసేవాడు కాదు. కావున ఆ సృష్ఠికర్త ఎప్పటికీ వెతకబడేవాడని, లేక ఎంతకాలమైనా దేవులాడబడేవాడని బిరుదుగ అతనిని **"దేవుడు"** అన్నారు. దేవుడంటే ఎవరికీ తెలిసేవాడు కాదని అర్థము. అందువలన ఆయనను ఎవరూ ఇంతవరకు చూడలేదనుమాట సత్యము. దేవుడనునది పేరుకాదని ఆయనకున్న బిరుదని జ్ఞప్తికియుంచుకోవలెను. అలాగే తయారుచేశాడు కాబట్టి సృష్ఠికర్త అంటున్నాము కానీ అదియు పేరుకాదు. దేవునికి పేరులేదు, అలాగే రూపములేదు. మనిషికి మాత్రము పేరూ ఉన్నది, రూపమూ ఉన్నది. **ఒక యంత్రమును చేసిన సృష్ఠికర్త మనిషికాగా, మనిషినీ, ప్రపంచమునూ తయారు చేసిన సృష్ఠికర్త దేవుడు.**

మనిషి చేసినది ఏదైనా మరొక మనిషికి అర్థము అవుతుంది. కానీ దేవుడు చేసిన పంచభూతములలో ఏదీ ఇంతవరకు మనిషికి అర్థము కాలేదు. ఆకాశములో గ్రహాలెన్నో, నక్షత్రములెన్నో కూడా నేటికీ తెలియదు. అట్లే మిగతా గాలి, అగ్ని, నీరు, భూమి యొక్క బలమెంతో కూడా తెలియదు. అంతేకాక మనిషి శరీర నిర్మాణములోని కొన్ని ఆంతర్యములు ఇంతవరకు ఎవరికీ అర్థముకాలేదు. కొన్ని రోగాలకు మందులే తెలియవు. కొన్ని రోగాలు ఎందుకొస్తున్నాయో కూడా తెలియదు. ఈ విధముగా దేవుడు చేసిన విశ్వమును గూర్చి పూర్తి తెలియని స్థితిలో మానవుడున్నాడు. దేవుడు చేసిన విశ్వమే అర్థముకానపుడు దేవుడు ఎవరికి తెలియగలడు? అందువలన ఆయన ఎవరికీ తెలియనివాడని అర్థమొచ్చునట్లు దేవుడన్నాము.

దేవుని విషయము ఏ కొంత కూడా మానవునికి తెలియదు, కావున దేవుడే స్వయానా తన అడ్రస్‌ను మనిషికి తెలియజేయాలనుకొన్నాడు. ఆకారము పేరులేని దేవుడు మనిషితో మాట్లాడి చెప్పవలసి వచ్చినపుడు మనిషి ఆకారములోనే వచ్చి మనిషి భాషలోనే చెప్పవలసివచ్చినది. అలా తన విషయమును చెప్పినపుడు తాను తయారు చేసి, తనతో సమానమైన శక్తినిచ్చి, మనుషులలో మిళితము చేసియుంచిన కంటికి కనిపించని ఒకదానిని గురించి కూడా చెప్పెను. దేవుని చేత సృష్ఠించబడి, మనుషుల తలలలో గుణముల రూపములో ఇమిడియుండి, మానవలోకమును యంత్రమువలె నడిపించు దానిని **"మాయ"** అని అనుచున్నాము. దేవుడు సృష్ఠించిన విశ్వములో జీవరాసుల శరీరములను చంపునది, తిరిగి శరీరమును తయారుచేసి జీవులను పుట్టించునది **మాయయే!** దేవుని ఆజ్ఞతో మనుషుల చావుపుట్టుకలను కల్గించు మాయను తెలుసుకొనుట దుస్సాధ్య మని దేవుడే చెప్పాడు. **దుస్సాధ్యమైన మాయను తెలియాలంటే దేవుని జ్ఞానమున్న వారికే సాధ్యమగునని** కూడ భగవద్గీతలో దేవుడే చెప్పాడు. మాయ యొక్క ముఖ్యమైన పని ఏమనగా! మనుషుల జీవితములను తన గుణములచేత ప్రవర్తింపజేయుచూ, దైవము యొక్క ధ్యాస మానవునిలో లేకుండా చేయుచుండును. ఒకవేళ ఎవరికైనా దేవుని మీద ధ్యాస ఏర్పడి దేవుని విషయమును తెలుసుకోవాలనుకుంటే, వానికి మాయ తన యొక్క జ్ఞానమునే అందించి, అదియే దేవుని జ్ఞానమని నమ్మునట్లు చేయును. తలలోనే తిష్టవేసి గుణములచేత మానవుని నడిపించు మాయ, తనను ఎవరూ ఏమాత్రము గుర్తుపట్టనట్లుండి, మానవున్ని దేవుని మార్గములోనే ప్రయాణించునట్లు నమ్మించి, దేవునికి దూరమగునట్లు చేయుచుండును. అటువంటి మనిషికి దేవుడే వచ్చి నీవు దేవుని మార్గములో లేవు, మాయ మార్గములో ఉన్నావని చెప్పినప్పటికీ, చెప్పేవాడే మాయ ప్రతినిధి అని

అనుకొంటాడు తప్ప మనిషి తన మార్గమును వదలడు. మనిషికి ఎంతో గొప్ప జ్ఞానమూ, విచక్షణాశక్తియుంటేగాని మాయను గుర్తించలేడు. అందువలననే మాయను గుర్తించాలంటే ఎంతో జ్ఞానముండాలని ముందే చెప్పాము. జగత్తును సృష్టించిన దేవుడు జగత్తును నడిపించు విధానమును మాయకు ఒప్పజెప్పాడని ముందే అనుకొన్నాము కదా! మాయచేత నడుపబడు మనిషి దేవుడొకడున్నాడను ధ్యాస మరచిపోయాడు. సృష్టించిన దేవుడు కనిపించడు, నడిపించు మాయ కనిపించదు. అలాంటపుడు మనిషికి కనిపించునదంతా తనకు తానే చేసుకొనునట్లు తెలియుచున్నది. అందువలన అన్ని పనులు నేనే చేస్తున్నానని, నేనే యోచిస్తున్నానని, అంతా నా బలమేనని, అంతా నా తెలివేనని, నేనే పుట్టాను, నా ఇష్టమొచ్చినట్లు జీవిస్తున్నాను, నేనే చస్తున్నానని అనుకొనుచున్నాడు. అటువంటివాడు పూర్తి మాయవశములో ఉన్నాడని గుర్తుంచుకోవలెను.

మానవుడేమనుకొనినా సర్వసృష్టికీ మానవునికీ అందరికీ పెద్ద ఒక దేవుడే. దేవుని జ్ఞానమును మించిన జ్ఞానముగానీ, దేవున్ని మించినదేదిగాని ఎక్కడా లేదు. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగములో దేవుని యొక్క విశ్వరూపము చూచిన తర్వాత అర్జునుడు ఆశ్చర్యపోయి **"ఓ దేవా నీవు అణువణువునా వ్యాపించియున్నావు. నీవులేని చోటుగానీ, నీవులేని వస్తువుగానీ లేదు. పైన, క్రింద, ప్రక్కలా నిండియున్నావు. అందువలన నీకు పైకి మ్రొక్కుచున్నాను, క్రిందికి మ్రొక్కుచున్నాను, ప్రక్కలకు మ్రొక్కు చున్నాను"** అన్నాడు. దీనినిబట్టి దేవుడు "సర్వవ్యాపి" అని తెలియుచున్నది. అంతేకాక ఆయనను మించినది ఏదీలేదని తెలియుచున్నది. అంతగొప్ప దేవున్ని మనము అర్థము చేసుకోవడానికి ఎందరో జ్ఞానమును తెలిసిన పెద్దలు ఎన్నో విధముల చెప్పారు. అయినప్పటికీ దేవుడు అంత సులభముగా అర్థమగువాడు కాదు, గనుక మనము ఆయనను ఇంకను విశదీకరించుకొని చెప్పుకోవలసిన అవసరమున్నది. ఆ ప్రయత్నములోనే [illegible]గా!

దేవుని చేత సృష్టింపబడిన విశ్వమును ప్రపంచమని, జగత్తని రెండు భాగాలుగా విభజించుకొన్నాము. ప్రపంచము అనగా ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. అలాగే జగత్తు అనగా ప్రాణమున్న సమస్త జీవరాసులని చెప్పుకోవచ్చును. ఇపుడు ప్రపంచము + జగత్తు = విశ్వమని సులభముగా చెప్పుకోవచ్చును. సృష్టికర్తయిన దేవుడు విశ్వమంతా వ్యాపించియున్నాడు. విశ్వమంతా అణువణువునా వ్యాపించిన దేవుడు మూడు విధములుగా వ్యాపించియున్నాడని చెప్పవచ్చును. ఎట్లనగా! ప్రపంచములో ఒక భాగముగా, జగత్తులో రెండు భాగములుగా వ్యాపించియున్నాడు. కొందరికి ఈ మాట కొంత విచిత్రముగ కనిపించినప్పటికి ఇది పూర్తి సత్యము మరియు శాస్త్రబద్ధము. ఇదే విషయమును ఇంకా కొంత విశధీకరించుకొని చెప్పుకొంటే, సృష్టికి పూర్వము ఒక్కడే అయిన దేవుడు సృష్టి తర్వాత మూడు భాగములుగ విభజింపబడినాడు. ఆ మూడు భాగముల పేర్లే 1) క్షర 2) అక్షర 3) పురుషోత్తములని గీతయందు పురుషోత్తమప్రాప్తియోగములో 16,17 శ్లోకములలో చెప్పబడినవి. ఒకే దేవున్ని ముగ్గురు పురుషులుగా గీతలో చెప్పారు. ఒకరు క్షర పురుషుడని, రెండవవాడు అక్షరపురుషుడని, మూడవవాడు ముందు గల ఇద్దరి పురుషులకంటే ఉత్తముడని చెప్పుచు పురుషోత్తముడన్నారు. పురుషోత్తముడన్నది బిరుదు తప్ప పేరుకాదని జ్ఞప్తికి పెట్టుకోవలెను. పురుషోత్తముడు జగత్తుయందును, జగత్తు బయట ప్రపంచమందును వ్యాపించియున్నాడు. అనగా శరీరము లోపల, శరీరము బయట దేవుడు వ్యాపించియున్నాడని అర్థము. శరీరము బయట లేకుండ శరీరము లోపల మాత్రము శరీరమంతా వ్యాపించినవాడు అక్షరపురుషుడు. శరీరము బయటగానీ, శరీరమంతాగానీ లేకుండా శరీరములో ఒక్కచోట రవ్వంత జాగాలో ఉన్నవాడు క్షర పురుషుడు.

ఈ విధముగ విశ్వమంతా నిండిన దైవము క్షరాక్షరములుగా శరీరములందు కూడా ఉన్నాడు. ఈ క్షర, అక్షర, పురుషోత్తములనే అందరికి తెలిసే విధముగ జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని కూడా గీతలోనే అన్నారు. ఇదంతయు దైవజ్ఞానమును తెలిసిన మనిషికి, భగవద్గీత అర్థము చేసుకొన్న మనిషికి, సంపూర్ణ జ్ఞాని అయిన వానికి తెలియును. భగవద్గీత తెలియని వానికిగానీ, దైవజ్ఞానము తెలియని మనిషికిగానీ మూడు ఆత్మలను గురించి ఏమాత్రము తెలియదు. జ్ఞానములేని మనిషి దేవున్ని మరచి, తనను మాత్రమే జ్ఞప్తికుంచుకుని, నేనే అన్నీ చేయుచున్నాననుకొనుచుండునని ముందే చెప్పుకొన్నాము. ఈ విధముగ మనుషులలో దేవుని జ్ఞానము తెలిసి దైవమార్గములో ఉన్నవారుగలరు. అట్లే దైవజ్ఞానము తెలియక మాయ ప్రభావమును కూడా తెలియక మాయమార్గములో చిక్కుకొన్నవారు కూడా గలరు. దైవజ్ఞానము తెలిసిన వానికి మాయ విధానము కూడా తెలిసియుండును. అందువలన మాయలో చిక్కుకొనక జాగ్రత్తపడు చుండును. దైవజ్ఞానము తెలియనివానికి మాయంటే ఏమిటో కూడా తెలియదు, కావున వాడు మాయమార్గములో తెలియకనే ఉండును.

జ్ఞానము తెలిసి దైవమార్గములో ఉన్నవాడు దేవున్ని గొప్పగా భావించుకొనియుండును. జ్ఞానము తెలియక మాయమార్గములో ఉన్నవాడు దేవుడున్నాడనుమాట మరచి, మనిషికంటే మించిన దేవుడు లేడను చుండును. జ్ఞాని లెక్కలో దేవుని గుర్తింపు ఒక రకముగా ఉండగా, అజ్ఞాని లెక్కలో దేవుని గుర్తింపు మరొక విధముగా ఉండును. ఇంకనూ వివరముగ చెప్పుకొంటే జ్ఞాని లెక్కలో దేవుని కోడ్ ఒక విధముగా ఉంటే, అజ్ఞాని లెక్కలో దేవుని కోడ్ ఇంకొక విధముగా ఉండును. మనము బాగా అర్థము చేసుకొనుటకు కోడ్ రూపములో చెప్పుకోవలసి వచ్చినది. ముందు జ్ఞాని లెక్కలో దేవుని కోడ్ ఎట్లుండునో తెలుసుకొందాము. సంఖ్యలో అన్నిటికంటే

పెద్దది "9" చిన్నది "0". సున్ననుండి పైకివస్తే అన్నిటికంటే పెద్దది తొమ్మిదే అగును. తొమ్మిదిని మించిన సంఖ్యలేదు. ఆ విధముగనే సృష్ఠిలో అన్నిటికంటే పెద్దది పరమాత్మ (దేవుడు). దేవుడు విశ్వములో మూడు అంచెలుగ విభజింపబడి మూడు ఆత్మలుగా ఉన్నాడు.

పరమాత్మను (దేవున్ని) విభజించితే మూడు అంచెలుగా ఉండాలి. జీవాత్మ ఎంతైతే ఉందో దానంత పెద్దది ఆత్మ ఉండాలి. జీవాత్మకంటే ఆత్మ ఎంత పెద్దదో అంతే పెద్దదిగా పరమాత్మ ఉన్నట్లు తెలియాలి. చివరికి పరమాత్మది పెద్ద సంఖ్య అయివుండాలి. దీనినిబట్టి పరమాత్మకంటే మూడంచెలు ఆత్మ చిన్నదనీ, ఆత్మకంటే మూడంచెలు జీవాత్మ చిన్నదని తెలియాలి. ఈ లెక్క సూత్రబద్ధమైనది. ఎందుకనగా! జీవాత్మ ఆత్మతో కలిస్తే పరమాత్మతో కలిసిపోతుందను సూత్రము భగవద్గీతలోనే గలదు. జీవాత్మ + ఆత్మ = పరమాత్మ అని అర్థము. అంటే మొదట పరమాత్మ బింబముగా జీవాత్మ ఆత్మ విభజింపబడి ఉన్నాయని అర్థము. పరమాత్మ బింబము 9 అయితే దాని ప్రతిబింబమైన ఆత్మ జీవాత్మ రెండు తొమ్మిదే కావాలి. 1+2=3 అన్నట్లు 3+6=9 అని తేలిపోయింది. అందువలన ఏ జీవుడైన పరమాత్మగా మారుటకు జీవాత్మ ఆత్మతో కలిస్తేనే సాధ్యమని **బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీత** చెప్పుచున్నది. జీవుడు మోక్షము పొందు సమయములో శరీరములో జీవుడు ఆత్మతో కలిస్తే, ఆ ప్రత్యేకమైన ఆత్మ పరమాత్మతో కలిసిపోవునని ఎన్నో సంవత్సరముల ముందే **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో కూడా చెప్పియున్నాము.

**ఈ విధముగా సృష్ఠి తర్వాత పరమాత్మ 9:6:3 నిష్పత్తి సంఖ్యగా ఉన్నాడని చెప్పుచున్నాము. దేవుడు మూడు ఆత్మలుగా ఉన్నాడా? అని ఎవరికైనా అనుమానము కలిగితే భగవద్గీత 15 అధ్యాయములో 16,17 శ్లోకములను చూచి వారి సంశయమును తీర్చుకోవచ్చును.**

(15) శ్లో॥ 16 ః ద్వావిమౌ పురుషౌ లోకేక్షర శ్చాక్షర ఏవచ ।

క్షర స్సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే ॥

(జీవాత్మ, ఆత్మ)

(15) శ్లో॥ 17 ః ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యు దాహృతః ।

యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥

(పరమాత్మ)

**పరమాత్మ మూడు ఆత్మలుగా ఉన్నాడని తెలియుటకు, అందరికీ జ్ఞాపక ముండునట్లు పరమాత్మ గుర్తు 963 అని చెప్పుచున్నాము. దీనినే అందరు గుర్తుంచుకొనునట్లు 'సృష్టికర్త కోడ్ 963' అని వ్రాశాము. దీనినే త్రైత సిద్ధాంతముగా తెల్పుచున్నాము.**

సంఖ్యలలో పెద్దసంఖ్య 9 అని, అలాగే ఆత్మలలో పెద్ద ఆత్మ పరమాత్మ అని తెలియజేశాము. ఇప్పుడు కొందరికొక అనుమానమొచ్చి సంఖ్యలలో అన్నిటికంటే పెద్దసంఖ్య కోటి కదా! మీరేమో కేవలము తొమ్మిదే అంటున్నారే అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! బ్రహ్మవిద్యాశాస్త్రానుసారము ఆధ్యాత్మికములో ఏక సంఖ్యనే లెక్కించుకోవాలి, ద్విసంఖ్యను వేసుకోకూడదు. ఎందుకనగా ఇది దైవ మార్గము, ఇందులో ఏకసంఖ్యకే విలువ. **'దేవుడు ఒక్కడే'** అను సూత్రము ప్రకారము ఎక్కడైనా దేవుని జ్ఞానములో ఒక్క సంఖ్యనే తీసుకోవాలి. ఇక్కడ మరొక్క సంశయము మీకు రావచ్చును. **"ఇంతవరకు దేవుని గుర్తు 963 అని మూడు సంఖ్యలను మాకు చెప్పారు కదా! ఇపుడేమో ఏకసంఖ్యకే విలువ అంటున్నారే"** అని అడుగవచ్చును దానికి సమాధానమేమనగా! నేను అక్కడ కూడ కలిపి చెప్పలేదు. మూడు ఆత్మల నిష్పత్తి విడివిడిగానే ఉన్నది. ఒక్కొక్క ఆత్మకు

ఒక్కొక్క సంఖ్యను సూచించాము అని గుర్తుంచుకోవలెను. పెద్ద ఆత్మకు "9" గుర్తు కాగా, మధ్య ఆత్మకు "6" గుర్తుకాగా, చిన్న ఆత్మ అయిన జీవాత్మకు "3" గుర్తుగా ఉన్నదని తెలిపాము.

సృష్ఠికంతటికి పెద్ద అయిన పరమాత్మను (దేవున్ని) ఎవరూ తగ్గించలేరు, హెచ్చించలేరు. దేవున్ని విడగొట్టి చెప్పుకొనినా హెచ్చించి చెప్పుకొనినా ఆయనకు ఏ లోటురాదు, ఆయన విలువ ఏమాత్రము తగ్గిపోదు. అలాగే దేవున్ని పెద్ద సంఖ్యగా భావించిన తొమ్మిదిని కూడా విడదీసినా, హెచ్చించినా తన ఏక స్థానము విలువ మారదనియే చెప్పుకోవచ్చును. అదెలా అని కొందరడుగవచ్చును. దాని అనుమానము తీరునట్లు తొమ్మిది సంఖ్యను భాగాలు చేసి చూద్దాము 1,5,3,గా తొమ్మిదిని విడదీయగా మూడు సంఖ్యలుగా కనిపిస్తు ఉన్నది. ఆధ్యాత్మికవిద్యరీత్యా ఏక స్థానమునకే విలువ కావున మూడు సంఖ్యలను కలిపితే 1+5+3=9 అగును. ఇక్కడ ఏ సంఖ్య అయిన విడదీసినది కలిపితే తిరిగి అదే సంఖ్యవచ్చును కదా అందులో ప్రత్యేకించి తొమ్మిదినే చెప్పుకోవడమేమిటి అని కూడా కొందరడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! విడదీసిన ఏ సంఖ్య అయినా తిరిగి కలిపితే అదే అగును, అది వాస్తవమే. కానీ నేను చెప్పినది ఒక్క విడదీయడమే కాదు, ఒక సంఖ్యను విడదీసినా, హెచ్చించినా దాని ఏక స్థానమును కోల్పోదు అని చెప్పాను. అదియే తొమ్మిది అని చెప్పాను. తొమ్మిది తప్ప ఏ సంఖ్య అయిన హెచ్చించితే తన ఏక స్థానమును కోల్పోవును. ఉదాహరణకు ఏడును రెండింతలుగా హెచ్చించి చూస్తాము 7×2=14 ఇక్కడ పదునాలుగైనది. దానిని ఏక సంఖ్య చేసి చూస్తాము 1+4=5 కలిపి చూస్తే చివరకు ఐదయినది. మొదట ఏడు హెచ్చించపబడి చివరకు ఐదుగా మారిపోయినది కదా! ఇలా తొమ్మిది

తప్ప మిగతా సంఖ్యలను విభజించినా, హెచ్చించినా వాటి ఏక సంఖ్య విలువ మారిపోవును. ఇప్పుడు ఉదాహరణగా తొమ్మిదినే చూస్తాము.

| విభజన | హెచ్చింపు |
|---|---|
| 1+8=9 | 9×1=9 - 0+9=9 |
| 2+7=9 | 9×2=18 - 1+8=9 |
| 3+6=9 | 9×3=27 - 2+7=9 |
| 4+5=9 | 9×4=36 - 3+6=9 |
| 5+4=9 | 9×5=45 - 4+5=9 |
| 6+3=9 | 9×6=54 - 5+4=9 |
| 7+2=9 | 9×7=63 - 6+3=9 |
| 8+1=9 | 9×8=72 - 7+2=9 |
| | 9×9=81 - 8+1=9 |

విశ్వములో దేవుడు ఏ విధముగా ఎవరు పొగిడినా, ఎవరుతిట్టినా ఒకే విలువ కలిగియున్నాడో, అదే విధముగా దేవునిగా పోల్చిన తొమ్మిది కూడా ఎవరు హెచ్చించినా, ఎవరు విభజించినా ఒకే విలువ కలిగియున్నది.

ఇక ఆరుగా గుర్తించబడిన ఆత్మ విషయానికి వస్తే చాలామంది మాటలలో ఆత్మ అనుమాట అక్కడక్కడ వినిపిస్తూనే ఉంటుంది. ప్రతి స్వామి, ప్రతి బోధకుల మాటలలో ఆత్మ అనుమాట పలుకబడుచుండును. ఆత్మహత్య అనీ, ఆత్మవిశ్వాసమనీ, ఆత్మధైర్యమనీ, ఆత్మబలమని, ఆత్మాభిమానమనీ, ఆత్మ ఔన్నత్యమనీ, ఆత్మజ్ఞానమనీ ఎన్నో సందర్భములలో ఆత్మను ఉచ్చరించుచునే ఉందురు. కొందరైతే మేము ఆత్మజ్ఞానులమని

ప్రకటించుకొన్న వారు కూడా కలరు. ఎవరు ఎన్ని విధముల ఆత్మను అనుకొనినా, ఇంతవరకు జగతిలో ఆత్మయొక్క నిజస్వరూపము ఎవరికీ తెలియదనే చెప్పవచ్చును. ఏకంగా ఆత్మజ్ఞానులున్న ఈ కాలములో మీరేమిటి ఆత్మ ఏమిటో ఎవరికీ తెలియదంటున్నారు? అని కొందరు అడుగవచ్చును. దానికి జవాబు, ఇంతవరకు దేశములో **త్రైత సిద్ధాంతము** లేదు. అంటే మూడు ఆత్మల వివరము లేదు. అద్వైతము, ద్వైతము ఉన్నది. కావున ఆత్మ అని ఎవరైనా అనినా దానిని జీవాత్మగానే భావించి చెప్పుకొనుచున్నారు, కానీ ప్రత్యేకమైన ఆత్మగా ఎవరు చెప్పుకోలేదు. ప్రత్యేకమైన ఆత్మ మాకు తెలుసునంటే త్రైతము వారికి తెలిసియుండాలి. త్రైతము ఇంతవరకు తెలియదు కావున ఇంతకుముందు ఆత్మ అను మాటను ఎవరు ఎట్లు చెప్పుకొనినా ఆత్మయొక్క నిజస్వరూపమేమిటో ఎవరికీ తెలియదనే చెప్పవచ్చును. ఆత్మను గురించి మేము చెప్పు కొద్దిపాటి వివరమేమంటే ఆత్మ అటు పరమాత్మకు ఇటు జీవాత్మకు మధ్యవర్తిలాంటిది. మధ్యవర్తి అయిన ఆత్మను చేరనిదే ఏ జీవాత్మ పరమాత్మను చేరలేదు. సంఖ్య ప్రకారము జీవుడు మూడు అయితే దేవుడు తొమ్మిది అయితే మధ్యలో ఆత్మ ఆరే అగును కదా! అందువలన ఆత్మను ఆరుగానే లెక్కించు కోవలసివచ్చినది.

ఇక జీవాత్మను మూడుగానే ఎందుకు లెక్కించుకోవలసివచ్చినదంటే! పరమాత్మనుండి మూడవవాడు జీవాత్మ. పరమాత్మ సంఖ్య అయిన తొమ్మిది నుండి సమానమైన మూడంచెలను గుర్తిస్తే, రెండవది ఆత్మ ఆరైనపుడు మూడవ జీవాత్మ మూడే అగును. ఇది పైనున్న పరమాత్మ సంఖ్యనుండి గుర్తిస్తే వచ్చునది. అలాకాకుండా మొదట జీవున్ని మూడుగా గుర్తించిన తర్వాతే మూడవదైన పరమాత్మను తొమ్మిదిగా గుర్తించవచ్చును కదా అని కూడా కొందరడుగవచ్చును. ఆ విధముగా క్రిందనున్న జీవాత్మనే మొదట

మూడుగా గుర్తించుటకు కూడా కారణము గలదని చెప్పవచ్చును. అదేమనగా! మనిషి పుట్టినప్పటినుండి వానిలోని జీవుడు మూడుగుణముల మధ్యలోనే చిక్కుకొని నివాసము చేయుచుండును. శరీరములో జీవుని నివాసము చాలామందికి తెలియదు. ప్రతి జీవరాసి తలలోని బ్రహ్మ, కాల, కర్మ, గుణ అను నాల్గుచక్రములలో చివరిది, క్రిందిది అయిన గుణ చక్రములో జీవుడు నివాసముంటున్నాడు. గుణభాగములు సాత్త్విక, రాజస, తామసములని చాలామందికి తెలుసు. ఈ మూడు గుణ భాగములలో పుట్టింది మొదలు చచ్చేవరకు జీవుడున్నాడు కావున జీవాత్మను మూడు అని గుర్తించవచ్చును. గీతలో కూడా త్రిగుణ సహితుడు జీవుడని చాలామార్లు చెప్పారు. మూడు గుణములలో జీవుడు ఇమిడియున్నాడు, కావున అతనిని మూడుగానే గుర్తించి అక్కడినుండి ఆరవవాడు ఆత్మయనీ, తొమ్మిదవవాడు పరమాత్మయని కూడా చెప్పవచ్చును. అక్కడ పరమాత్మను తొమ్మిదిగా గుర్తించుటకు విశేషత ఎట్లున్నదో అదే విధముగ ఇక్కడ జీవాత్మను గుర్తించుటకు కూడా మూడు గుణముల విశేషత కలదు.

సృష్ఠికి పూర్వము ఒక్కటిగాయున్న దేవుడు, సృష్ఠిలో మూడు భాగములుగా విభజింపబడి పరమాత్మ, ఆత్మ, జీవాత్మగా ఉన్నాడు. **అందువలన దేవున్ని త్రైతము అన్నాము. దేవున్ని సిద్ధాంతరీత్యా తెలుపు జ్ఞానమును త్రైత సిద్ధాంతము అన్నాము.** ఇదంతయూ జ్ఞానము తెలిసినవాడు దేవుని వివరమును గుర్తించగలడు. అటువంటివాడు సృష్ఠికర్త కోడ్ 963 గా తెలియగలడు. ఇంతవరకు దేవుని గుర్తును తెలుసుకొన్న ప్రకారము దేవునితో సమాన బలమై మనిషి తలలో తిష్టవేసియున్న మాయను గురించి, దానికిగల గుర్తింపు సంఖ్యను గురించి తెలుసుకొందాము. మాయలో ఇమిడిపోయి, దాని మార్గములో ప్రవర్తించుచు, దేవుని జ్ఞానమును తెలియనివాడు దేవుడున్నాడనిగానీ, ఆత్మ ఒకటున్నదనిగానీ తెలియదు.

వానికి తెలిసినదంతా తానే అన్నీ చేసుకొనుచున్నాననుకొనుచుండును. తాను అనుకొన్నట్లు చేయుచున్నాననీ, నేనే ధనమును సంపాదించుకొన్నాననీ, నా తెలివితో నాకు గొప్ప ఉద్యోగము వచ్చినదనీ, నేను చెప్పితేనే కొన్ని పనులు జరుగుననీ, నేను బలవంతుడుననీ, నేను భోగములను నాయుక్తితో అనుభవిస్తున్నాననీ, నేను చేస్తేనే జరుగుచున్నది, దేవుడు చేసేది ఏమీ లేదనీ, అటువంటపుడు దేవుడు ఉన్నాడనుట అసత్యమనీ, మనిషే దేవుడని, నాకు నేనే దేవుడననీ, నన్ను మించిన దేవుడు లేడని అనుకొనుచుండును. అటువంటివానికి అందరనుకొను దేవుడే కనిపించనపుడు, ఎవరికీ తెలియని ఆత్మ తెలియునా! వానికి తాను (జీవాత్మ) తప్ప పరమాత్మ, ఆత్మ తెలియదు. అటువంటివానిని జ్ఞానమున్న వాడు చూచినపుడు, తనకున్న జ్ఞానముతో తనలోనున్న దేవున్ని (ఆత్మలను) 963గ గుర్తించినవాడు, అజ్ఞాని శరీరములోని జీవుడు నేనే దేవున్ని అనుకొను భావమున్నపుడు వాడు మాయ ప్రభావములో నిండియున్నాడని తెలిసి, మాయ ప్రభావములో మునిగియున్నవాని శరీరములో దేవుడు ఏ లెక్కలో ఉన్నాడో, ఏ సంఖ్యలో ఉన్నాడో తెలియును. అజ్ఞాని, దేవుడు నేను సమానమే అను లెక్కలో ఉన్నాడు. కనుక వాని లెక్కప్రకారము దేవుడు, వాడు (జీవుడు) సమానమే. అటువంటపుడు జ్ఞానికి తెలియునదేమనగా! మాయ వానిని కప్పియున్నది, కావున వానిలో మాయయే కనిపిస్తున్నది. అటువంటి మాయ కప్పియున్న వానిలో కూడా దేవుడున్నాడు. వానిలో ఏ నిష్పత్తిలో ఉన్నాడని చూచినపుడు గుర్తుంచుకోవలసిన ముఖ్యమైన సూత్రము ఒకటి గలదు. అదేమనగా! దేవుడున్నాడను దైవజ్ఞాని శరీరములో దేవున్ని గుర్తించవలసినపుడు పైన దైవము నుండి లెక్కించవలసియున్నది. అనగా పరమాత్మ, ఆత్మ, జీవాత్మ అను వరుస క్రమములో లెక్కింతుము. దేవుడు లేడు నేనే దేవున్ని అనుకొను వాని శరీరములో మూడు భాగములుగ ఉన్న దేవుని సంఖ్యను జీవాత్మనుండి

ప్రారంభించి లెక్కించవలసియున్నది. అనగా జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను వరుస క్రమముండును. దేవునివైపు నుండి ప్రారంభమవునది దేవుని గుర్తుగ చెప్పుదుము. అలాగే జీవునివైపు నుండి ప్రారంభమగు సంఖ్యను మాయ గుర్తుగ చెప్పవలసియున్నది. దైవ మార్గములోయున్న జ్ఞాని దేవుని జ్ఞానమునే చెప్పుచుండును. కావున వానిని దైవ ప్రతినిధిగా లెక్కించవలెను. అలాగే మాయమార్గములోనున్న అజ్ఞాని మాయ మాటలనే మాట్లాడు చుండును. కావున వానిని మాయ ప్రతినిధిగా లెక్కించవలెను. జ్ఞాని దైవ స్వభావము కల్గినవాడనీ, అజ్ఞాని మాయ స్వభావము కల్గినవాడనీ చెప్పవచ్చును. అందువలన ఒక మనిషిని చూచినపుడు వాడు జ్ఞాని అయితే మనకు దేవుడు గుర్తురావలెను. ఒకవేళ అజ్ఞాని అయితే మాయ గుర్తురావలెను. ఈ విధముగా దేవుడుగాని, మాయగానీ గుర్తువచ్చుటకు సులభమైన ఉపాయముగ జ్ఞానిని చూచినపుడు దేవుని కోడ్‌ను, అజ్ఞానిని చూచినపుడు మాయకోడ్‌ను జ్ఞప్తికి చేసుకోవలెను. అపుడు మాయకు దేవునికి వ్యత్యాసము తెలియుచుండును. దానివలన ఎవరూ మాయవైపు పోకుందురు. ముందు చెప్పిన సూత్రము ప్రకారము జ్ఞానిని చూచినపుడు, అజ్ఞానిని చూచినపుడు మూడు ఆత్మలను తేడాగా చెప్పుకొమ్మన్నాము కదా!

**జ్ఞాని = పరమాత్మ, ఆత్మ, జీవాత్మ → దేవుని కోడ్ వర్తిస్తుంది.**

**అజ్ఞాని = జీవాత్మ, ఆత్మ, పరమాత్మ → మాయ కోడ్ వర్తిస్తుంది.**

దీనిప్రకారము జ్ఞాని దేవుని పక్షములో ఉన్నాడు. కావున దేవుని కోడ్ అయిన 963 ను గుర్తించుకోవచ్చును. అలాగే అజ్ఞాని మాయ పక్షములో ఉన్నాడు, కావున మాయకోడ్‌ను ఏమని గుర్తించుకోవాలని కొందరడుగవచ్చును. కొందరు పరమాత్మది 9, ఆత్మది 6, జీవాత్మ 3 అయినపుడు దానినే జీవాత్మది మొదటిదిగా, రెండవది ఆత్మగ, మూడవది

పరమాత్మగ పెట్టుకొని 369 అని వ్రాసుకొంటే మాయగుర్తు అగును కదా అని మాయకోడ్ 369 అనుకోవచ్చును. దేవుని కోడ్ 963 అని మనము వివరముగ శాస్త్రబద్ధముగ చెప్పుకొన్నాము. కానీ జ్ఞానరీత్యా మాయకోడ్‌ను 369 అనకూడదు. 369 గణితశాస్త్రమునకు సరిపోయినప్పటికీ అన్నిటి కంటే పెద్దశాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రమునకు సరిపోదు. అటువంటపుడు దైవజ్ఞానమును అనుసరించి శాస్త్రబద్ధముగా మాయకోడ్‌ను చూడవలసి వచ్చినపుడు దేవుని శాస్త్రమైన, మరియు బ్రహ్మవిద్యాశాస్త్రమైన, భగవద్గీత లోని 16వ అధ్యాయమున 14వ శ్లోకమును గమనిస్తాము.

(16) శ్లో॥ 14. అసౌ మయా హత శ్శత్రుః హనిష్యే చాపరా నపి ।
ఈశ్వరోహ మహం భోగీ సిద్ధో హం బలవాన్ సుఖీ ॥

ఈ శ్లోకములోని రెండవ వాక్యమును మూడు భాగములుగా విభజింపవచ్చును. ఒకటి మహం ఈశ్వరోహ, రెండు సిద్ధోహం బలవాన్, మూడు భోగీ, సుఖీ. దీని అర్థము **"ఒకటి నేనే దేవున్ని, రెండు నేనే బలవంతుడను, మూడు నేనే భోగములనుభవిస్తు సుఖమును పొందు చున్నాను"** ఈ మాటలను మాయ ప్రభావములో ఉన్న మనిషి, దైవజ్ఞానము తెలియని మనిషి అనుకొనుచుండును. నేను అని అనుకొనుచున్న జీవుడు శరీరములో నిజముగా మూడు అర్హతలు కలిగియున్నాడా? జీవుడే దేవుడా? జీవునికే స్వయముగా బలమున్నదా? జీవుడు సుఖములను పొందు చున్నాడా? అని యోచిస్తే వాస్తవము ఈ విధముగా ఉన్నది. ఈ మూడు మాటలలో ముందు రెండు మాటలు నేను దేవున్ని, నేను బలవంతున్ని అనుట పూర్తి అసత్యము. చివరి మాటైన నేను భోగిని, సుఖిని అనుమాట మాత్రము సత్యము. ఇక్కడ జీవుడు అనుకొను రెండుమాటలు పూర్తి అసత్యమైనపుడు, జీవుడు అనుకొన్నట్లు అతను దేవుడుకాదు, బలవంతుడు

కాదని తెలియుచున్నది. దీనిని బట్టి మానవుని శరీరములో దేవుడువేరు జీవుడు వేరనీ, అలాగే బలవంతుడు వేరు, జీవుడు వేరనీ తెలియుచున్నది. నేనే దేవున్ని, నేనే బలవంతుడను అనుమాటలు అసత్యమనుటకు ఎంతో శాస్త్రబద్ధమైన ఆధారము గలదు. అదేమనగా!

మనకు తెలిసినా తెలియకుండినా మన శరీరములో మూడు ఆత్మలు గలవు. ఇది ఒక్క మానవుని శరీరములోనేకాక సమస్త జీవరాసుల శరీరములలోను మూడు ఆత్మలు గలవు. వీటినే జ్ఞానము తెలిసిన వాని దృష్టిలో 963 గుర్తుగ గుర్తించాము. వీనినే పరమాత్మయని, ఆత్మయని, జీవాత్మయని కూడా చెప్పుకొన్నాము. పరమాత్మ లోకత్రయమంతా వ్యాపించియుండి, అన్నిటిని భరించువాడైయుండి, అందరికి ఈశ్వరుడు (అధిపతి)గ యున్నాడని పురుషోత్తమ ప్రాప్తియోగము 17వ శ్లోకములో రెండవ వ్యాకమునందు ***"యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః"*** అనియుంది. **"పరమాత్మ అందరికీ దేవుడైయుండి, అందరి శరీరముల లోపల బయట అణువణువునా వ్యాపించియుండి, అందరినీ భరిస్తున్నాడని"** భగవంతుని చేత చెప్పబడినది. దీనినిబట్టి మన శరీరము లోపల మరియు బయట ప్రతి అణువులోను దేవుడున్నాడని తెలియుచున్నది. అది పరమాత్మ విధానముకాగా ఇక రెండవ ఆత్మ శరీరమంతా వ్యాపించియున్నది. ఆత్మ శరీరములోపల మాత్రమే గోరు, వెంట్రుకల చివర వరకు వ్యాపించియున్నది. శరీరము బయట ఏ కొద్దిమాత్రము కూడా ఆత్మలేదు. అలాగే శరీరములో ఆత్మ వ్యాపించని జాగాకూడా లేదు. ఇక మూడవదైన జీవాత్మ విషయానికి వస్తే శరీరములోని తల భాగములో, నొసలు (పాలభాగము) నకు సమానములో, తల మధ్యభాగములో కంటికి కనిపించని నాల్గుచక్రములైన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములయందు, క్రిందనున్న గుణచక్రములో,

ఆ గుణచక్రములోని మూడు భాగములలో ఏదో ఒక భాగమున పిండిరవ్వలో ఒక కణమంత పరిమాణములో జీవుడు నివాసముంటున్నాడు. దీనిని బట్టి జీవాత్మ శరీరములో ఒక్కచోట రవ్వంత జాగాలో మాత్రమున్నదనీ, తలలోని గుణచక్రములో తప్ప శరీరములో మరెక్కడా లేదని తెలియుచున్నది. ఇంతవరకు మూడు ఆత్మల నివాసము తెలుసుకొన్నాము కదా! అదే విధముగ మూడు ఆత్మల కార్యములను కూడ తెలుసుకొందాము.

పరమాత్మ లేక దేవుడు అనబడేవాడు విశ్వమంతా అణువణువునా వ్యాపించియున్నవాడై, అన్నిటికీ అధిపతిగయుండి తాను ఏ కార్యము చేయక మౌనముగా ఉన్నాడు. యజమాని తన సేవకుల చేతనే పని చేయిస్తూ తాను చేయక హోదాగా ఉన్నట్లు దేవుడు కూడా తాను తయారు చేసిన ఆత్మద్వారా అన్ని కార్యములను చేయిస్తూ జీవున్ని కేవలము అనుభవములను పొందునట్లు నియమించాడు. శరీరములోపల శరీరము బయట వ్యాపించిన పరమాత్మ ఏ కార్యములను చేయక స్తబ్ధతగా ఉన్నాడు. ఆత్మ శరీరములోని అన్ని కార్యములను చేయుచున్నది. శరీరములోపల జరిగెడు కార్యములేకాక బయట కార్యములుగానీ, జీవునికి తెలియకుండానే శరీరములోపల జరుగు కార్యములుగానీ ఆత్మ ఎల్లవేళల చేయుచున్నది. జీవుడు పుట్టింది మొదలు చనిపోవువరకు ఏకధాటిగా, ఏమాత్రము విశ్రాంతి లేకుండ పని చేయునది జగతిలో ఆత్మయొకటేనని చెప్పవచ్చును. ఇక జీవాత్మ విషయానికి వస్తే, జీవాత్మ కూడా ఏమాత్రము పని చేయువాడు కాదు. కానీ జీవాత్మ ఆత్మ చేసిన బయటి పనులలోని కష్ట సుఖ అనుభవములను అనుభవిస్తూ యుండును. ఒక్క నిద్రావస్థలో తప్ప మిగతా జాగ్రత్త, స్వప్న అవస్థలలో జీవుడు బాధను, సంతోషమును అనుభవిస్తూనేయుండును. ఇక్కడ కొందరికొక అనుమానము వచ్చి ఈ విధముగ ప్రశ్నించవచ్చును. “జీవుడు

దృశ్యములను చూస్తున్నాడు, శబ్దములను వింటున్నాడు. ఆ సందర్భానికి తగిన పనిని చేస్తున్నాడు కదా! అలాంటపుడు జీవుడు ఏ పని చేయలేదనడ మేమిటి?" అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా!

మన శరీరములో ఎల్లప్పుడు ఎన్నో పనులు జరుగుచున్నవి. అన్నిటిని ఆత్మ శరీరము ద్వారా చేయిస్తూయున్నది. శరీరములో ఎన్నో అవయవములు గలవు. కొన్ని అవయవములు శరీరము లోపల, కొన్ని అవయవములు శరీరము బయటగలవు. శరీరము లోపల గల అవయవములు గానీ, శరీరము బయటగల అవయవములనుగానీ ఆత్మే స్వయానా తనశక్తిచేత పనిచేయిస్తున్నది. ఆత్మ చేయిస్తుండగా అన్ని అవయవములు వాటివాటి పనులు చేయుచున్నవి. శరీరము లోపలా బయటా అనేక అవయవములు అన్ని వివిధరకములైన పనులను చేయుచున్నవి. శరీరము లోపల గుండె కదలుచు రక్తమును ప్రవహింప చేయుచున్నది. అది గుండెయొక్క నిర్ధిష్టమైన పని. అదే విధముగ ఊపిరితిత్తులు కదలుచు గాలిని ప్రవహింపచేయుచున్నవి. అది ఊపిరితిత్తుల యొక్క నిర్ధిష్టమైన పని. ఏ అవయవము పనిచేసినా అది ఆత్మ చైతన్యము చేతనే పని చేయుచున్నది. ఆత్మ శరీరమంతటా వ్యాపించి ప్రతి అణువులోని ధాతువులను పని చేయిస్తు శరీరావయవములన్నిటికీ శక్తినిచ్చుచున్నది. శరీరము ద్వారా బయట జరుగు కేవలము ఐదు జ్ఞానేంద్రియముల పనులు, ఐదు కర్మేంద్రియముల పనులు జీవునికి తెలియుచున్నవి. అలాగే శరీరము లోపల మనస్సు, బుద్ధి, చిత్తము చేయుపనులు కూడా తెలియుచున్నవి. జీవుడు శరీర బాహ్యేంద్రియముల పనిని తాను చేయకున్ననూ, అలాగే శరీరము లోపల అంతరేంద్రియములైన మనో, బుద్ధి, చిత్తముల పనిని తాను చేయకున్ననూ అవి తనకు తెలిసి జరుగుచుండుట వలన ఆ పనులను తానే చేసినట్లు, చేయుచున్నట్లు, చేయబోవునట్లు భ్రమిస్తున్నాడు. తన

నిజస్వరూపము తెలియని జీవుడు, తనకు ఏ శక్తి లేదని తెలియని జీవుడు అవయవముల పనులనుగానీ, బుద్ధియోచనలనుగానీ, చిత్తము చేయు నిర్ణయములనుగానీ తానే చేయునట్లు భ్రమలోపడ్డాడు. అటువంటి వానినే అజ్ఞానదశలోనున్న జీవుడు అంటాము. వానినే **"మాయ మనిషి"** అంటాము.

శరీరములో ఒక్కచోట రవ్వంతగయున్నవాడు, కేవలము కష్ట సుఖములను అనుభవించువాడు, ఏ పని చేయనివాడు, ఏ శక్తిలేనివాడు, కన్ను, చెవి బుద్ధికి పంపిన సమాచారమును ప్రక్కనుండి తెలుసుకొన్నవాడు, అజ్ఞానములోయుండి మాయ ప్రభావముచేత అహమును పొంది తాను చేయని పనులను తానే చేసినట్లు జీవుడు అనుకొనుచున్నాడు. ఆ విధముగ అనుకోవడము వలన జీవునికి తనకంటే పెద్దయిన ఆత్మ శరీరమంతానిండి చైతన్యశక్తియై యున్నదని తెలియదు. తనకంటే పెద్దదైన ఆత్మ శరీరములో ప్రత్యక్షముగ శక్తియైయున్నప్పటికీ తెలియని జీవుడు శరీరములోనే ఉలుకు పలుకు లేకుండా స్తబ్ధతగాయున్న పరమాత్మను మనిషి ఒప్పుకుంటాడా? ఒప్పుకోడనియే చెప్పాలి. అందువలన కొన్నిచోట్ల కొందరు దేవుడులేడనీ, మానవుని అభూతకల్పనయే దేవుడనీ, అన్నీ తానే చేయుచు దేవుని పేరు చెప్పడమేమిటనీ, ఏ యంత్రమునైన మానవుడే కనుగొన్నాడుగానీ దేవుడు తెచ్చి ఇవ్వలేదనీ, దేవుడున్నాడను వారిది ఒకరకమైన జబ్బని అనుట చూస్తూనేయున్నాము. అటువంటివారితో ఎంత వాదించినా వారు వినక పోవడమేకాక ప్రపంచములో మనిషికంటే మించిన దేవుడులేడని చెప్పుచుందురు. అటువంటివారిని మాయపక్షము వారనీ, పూర్తి అజ్ఞానులని చెప్పవచ్చును.

దైవజ్ఞానము కల్గిన మనిషిలోగానీ, మాయలో మునిగియున్న మనిషిలోగానీ, ఎంతో గొప్ప జ్ఞానముగల మహర్షిలోగానీ, ఏమాత్రము

జ్ఞానములేని బేవర్షిలోగానీ దేవుడు మూడు ఆత్మలగానేయున్నాడు. ఇంతకు ముందు జ్ఞాని శరీరములో దేవున్ని 963గ గుర్తించవచ్చునని చెప్పుకొన్నాము. అజ్ఞాని శరీరములో దేవున్ని జీవునివైపునుండి మాయను లెక్కించవలెనని కూడా అనుకొన్నాము. అట్లు లెక్కించితే 369 అనుకోవడము కూడా పొరపాటని అనుకొన్నాము. ఎందుకు మాయ సంఖ్య 369 కాదో, మాయకు జ్ఞానరీత్యా ఏ సంఖ్యను గుర్తించవచ్చునో వివరించుకొని చూచితే ఈ విధముగా అర్థము కాగలదు.

ఇపుడు భగవద్గీత 16వ అధ్యాయములోని 14వ శ్లోకముయొక్క రెండవ వాక్యమును చూస్తే మూడు భాగములుగ ఉన్నదని ముందే చెప్పుకొన్నాము. అందులో ఒకటి **"మహం ఈశ్వరోహ"** అని ఉంది. దీని అర్థము **"నేనే దేవుడను"** మాయమార్గములోనున్నవాడు నేనే దేవున్ని అనుకొనుచున్నప్పటికి వానిలో కూడా దేవుడు, ఆత్మ ఉన్నారు. ఇక్కడ జీవుని భావములో నేను దేవుడినంతటివాడననే భావమే కదా ఉండేది. అందువలన వాని భావము ప్రకారము వాని శరీరములో దేవున్ని జీవున్ని సమానముగ లెక్కించవలసియున్నది. అపుడు దేవుని సంఖ్యను ఆరుగా మార్చవలసియున్నది. జీవుని సంఖ్యను కూడా దేవుని సంఖ్యతో సమానముగా ఆరుగానే మార్చవలెను. జ్ఞానము కల్గిన జ్ఞానివైపు నుండి చూచినపుడు దేవుని సంఖ్య తొమ్మిది, జీవుని సంఖ్య మూడు. దేవుని సంఖ్యను జీవుని సంఖ్యను కలిపితే మొత్తము 9+3=12 వచ్చును. ఇపుడు అజ్ఞానము కల్గిన మాయ మనిషివైపు నుండి చూస్తే దేవుని సంఖ్య ఆరు జీవుని సంఖ్య కూడా ఆరే. దేవుని సంఖ్యను జీవుని సంఖ్యను కలిపితే మొత్తము 6+6=12 అగును. మధ్యలోని ఆత్మ ఎవరికీ తెలియకుండా ఉన్నది కావున దాని సంఖ్య చెడకుండ అలాగే ఆరుగానే ఉండును. కావున

జ్ఞానివైపునుండి చూచినపుడు 963 ఉన్న దేవుని సంఖ్య అజ్ఞానివైపునుండి చూచినపుడు మాయ సంఖ్యగ మారిపోయి 666 గ ఉన్నది. దీనిని బట్టి

**దేవునిసంఖ్య 963 వీటిని ఏకసంఖ్యగ మార్చితే 9+6+3=18, 1+8=9**

**మాయసంఖ్య 666 వీటిని ఏకసంఖ్యగ మార్చితే 6+6+6=18, 1+8=9**

జ్ఞానిలోనైనా, అజ్ఞానిలోనైనా దేవుడున్నాడనుటకు తార్కాణముగ చివరకు పరమాత్మ సంఖ్య తొమ్మిదే వస్తున్నది. అజ్ఞాని శరీరములో వాని భావమునుబట్టి జీవుడు దేవుడంతటివాడని తెలియునట్లు దేవుని సంఖ్య ఆరు, జీవుని సంఖ్య ఆరుగ ఉన్నదని గ్రహించవలెను. భగవద్గీత 16వ అధ్యాయము 14వ శ్లోకములోని రెండవ వాక్యములో, రెండవ భాగములో **"సిద్ధోహం బలవాన్"** అని ఉంది. దీనిఅర్థము **"శరీరములో బలమును నేనే"** ఈ మాటను జీవుడు అనుకోవడము తప్పా ఒప్పా అని పరిశీలించి చూస్తాము. శరీరములో ఒక వస్తువును ఎత్తడానికిగానీ, ఒక పనిని చేయడానికి గానీ బలము అవసరము. కార్యమునకు కావలసిన బలమును సహజముగా ఆత్మ తన నాడీకేంద్రముల ద్వారా శరీరమునకిచ్చుచున్నది. వివరముగా చెప్పుకొంటే ఆత్మ తనశక్తితో శరీరమును నడిపిస్తూ అన్ని కార్యములు చేయుచున్నది. బలవంతుని శరీరములోనున్న ఎక్కువ బలముగానీ, బలహీనుని శరీరములో ఉన్న తక్కువ బలముగానీ వాని శరీరములోని ఆత్మదేనని తెలియవలయును. శరీరములో ఆత్మ ఎవరికీ తెలియకుండ నివాసము చేయుచున్నది. అందువలన జీవాత్మ తన శరీరములో కలుగు బలము తనదేననుకొనుచున్నాడు. దీనినిబట్టి శ్లోకములో జీవుడు బలము నాదేనని అనుకొనుచుండునని భగవంతుడు తెలియజేశాడు. శ్లోకములోని వాక్యముయొక్క మొదటి భాగములో నేనే

దేవుడనని అనుకోవడము, అలాగే రెండవ భాగములో నేనే బలమునని అనుకోవడము జీవుని యొక్క పూర్తి అజ్ఞానము. వాస్తవానికి జీవుడు దేశములో దేవుడు కాదు, శరీరములో బలముకాదు. శరీరములో రెండవ ఆత్మ యొక్క బలము నేనే అనుకోవడము వలన జీవుడు ఆత్మతో సమానమైనవాడుగ భావింపబడుచున్నాడు. ఆ లెక్క ప్రకారము శరీరములో ఆత్మయొక్క సంఖ్య ఆరు కదా! అందువలన జీవుని సంఖ్య కూడా ఆరుగానే లెక్కించవలసి వచ్చినది. జ్ఞానము ప్రకారము జీవుని సంఖ్య మూడే (3) అయినప్పటికీ, జీవుని అజ్ఞానపు భావము ప్రకారము జీవుని సంఖ్యను ఆత్మతో సమానముగ ఆరుగ (6) లెక్కించవలసి వచ్చినది. దీని ప్రకారము కూడా అజ్ఞానమువైపు నుండి చూస్తే మాయ సంఖ్య 666 అని మూడు ఆత్మలను సమానముగా చెప్పవలసివచ్చినది.

విశ్వములో ఎటు చూచినా దేవున్ని మించినది లేదు. దేవుడు సర్వవ్యాపి, సర్వసృష్టికర్త. అందువలన ఇటు జ్ఞానిలోగానీ అటు అజ్ఞానిలో గానీ దేవుడున్నాడనుటకు ఏకసంఖ్య తొమ్మిదే రావలయునను సూత్రము ప్రకారము ఇటు జ్ఞానిలోని దేవుని కోడ్ చివరకు తొమ్మిదే వుండును. అలాగే అజ్ఞానిలోని మాయకోడ్ చివరకు తొమ్మిదే వుండును. మనిషి జ్ఞాని గానీ అజ్ఞానిగానీ వానిలోని మూడాత్మలు దేవునిలోని భాగములే. అందువలన దేవుని సంఖ్య అయిన చివరిది పెద్దదైన తొమ్మిది ఇటు దేవునికోడ్‌లోను ఉంది, అటు మాయకోడ్‌లోను ఉంది. జ్ఞానముప్రకారము చూస్తే దేవుని కోడ్‌లో ఆత్మకిరుప్రక్కలనున్న పరమాత్మ జీవాత్మ సంఖ్యలు వాస్తవస్థితిలో 9,3 గా ఉన్నవి. అజ్ఞానము ప్రకారము చూస్తే మాయకోడ్‌లో ఆత్మకిరు ప్రక్కలనున్న పరమాత్మ జీవాత్మల సంఖ్యలు అవాస్తవస్థితిలో 6,6 గా ఉన్నవి.

**పరమాత్మ - ఆత్మ - జీవాత్మ**

| | | | |
|---|---|---|---|
| **జ్ఞానము ప్రకారము దేవునికోడ్** | **9** | **6** | **3** |
| **అజ్ఞానము ప్రకారము మాయకోడ్** | **6** | **6** | **6** |

ఇప్పటికి మాయకోడ్ లేక సాతాన్‌కోడ్, లేక సైతాన్‌కోడ్ 666 అని వివరము తెలిసియుండుననుకొంటాను. దీనిని గమనిస్తే అజ్ఞాన భావమున్న వానిలోగానీ, జ్ఞాన భావమున్న వానిలోగానీ ఆత్మ సమానముగా పని చేయుచున్నది. అందువలన ఎటుపోయినా ఆత్మ సంఖ్య ఆరుగానే ఉన్నది. అంతేకాక దేవునికోడ్‌గల జ్ఞాని శరీరములోగానీ, మాయకోడ్‌గల అజ్ఞాని శరీరములోగానీ దేవుడు అణువణువునా వ్యాపించియున్నాడనడానికి కొంత ఆధారము ప్రతి శరీరములోనూ ఉన్నది. మనిషి శరీరమును విడదీసి చూస్తే ఎన్నో కోట్ల కణములతో కూడుకొన్నదై ఉన్నది. అంటే శరీరములోని అణువణువున ధాతు కణములున్నవని తెలియుచున్నది. కంటికి కనిపించని కణములు మనిషి శరీరములో ఎన్ని కోట్లు ఉన్నవో ఖచ్చితమైన సంఖ్య చెప్పలేమనియే చెప్పవచ్చును. అయినప్పటికీ ఒక చిన్న ఆధారముతో మనిషికి తొమ్మిది సంవత్సరముల వయస్సు వచ్చేటప్పటికి 108 కోట్ల కణములు అభివృద్ధియై ఉండవచ్చునను అంచనాగలదు. ప్రాణముతోయున్న శరీరములోని ఒక కణమును తీసుకొని చూచిన అందులో ఒక విధముగ దైవము కనిపిస్తూయున్నది. అదెలా అనగా! దేవుని సంఖ్యను మూడు ఆత్మల సంఖ్య 963 గ గుర్తించుకొన్నాము కదా! ఈ మూడు సంఖ్యలను కలిపితే 9+6+3=18 మొదట ద్విసంఖ్య 18 వచ్చుచున్నది. ఆ ద్విసంఖ్యను ఏకసంఖ్యగ చేస్తే 1+8=9 వస్తున్నది. దీనిని బట్టి మూడు ఆత్మలు కలిసిపోతే చివరకు పరమాత్మగ మారిపోవునని అర్థమగుచున్నది. మొదట సృష్ఠాదిలో అద్వైతముగనున్న పరమాత్మ ద్వైతముగ మారిపోయినది. అంటే ఒకటిగ

నున్న పరమాత్మనుండి ఆత్మ వెలువడి రెండుగ మారిపోయినవి. అదే సంఖ్యరూపములో చెప్పుకొంటే తొమ్మిది విడిపోయి రెండుగ తయారైనది 9=1+8. తర్వాత మూడు సంఖ్యలుగ మారిపోయి 963 గ తయారైనది అదియే త్రైతము. మొదట అద్వైతము, ఆ తర్వాత ద్వైతము, ఆ తర్వాత త్రైతము తయారైనది. జీవుడు మోక్షము పొందాలంటే త్రైతమునుండి ద్వైతముగ మారిపోవాలి, తర్వాత అద్వైతముగ మారిపోవాలి. అందువలన మోక్షము పొందిన వానిని పెద్ద సంఖ్య అయిన తొమ్మిదిగా చెప్పవచ్చును. మోక్షము పొందు సమయములో జీవాత్మ ఆత్మలో కలిసి పోతుందనీ, జీవాత్మతో కలిసిన ఆత్మ పరమాత్మలో కలిసిపోతుందని మరణ సిద్ధాంతములో కూడా చెప్పుకొన్నాము.

ఇదంతా చెప్పడము దేనికంటే శరీరములో అంతటా వ్యాపించి యున్నవి రెండే రెండు ఆత్మలు. అవియే ఒకటి పరమాత్మ, రెండవది ఆత్మ. రెండు ఆత్మలు శరీరమంతా వ్యాపించియున్నాయనుటకు గుర్తుగ శరీరమంతా నిండియున్న కోట్ల కణములలో 1:8 పరమాత్మ ఆత్మల నిష్పత్తి కనిపిస్తుయున్నది. వివరించుకొని చూచితే కణములోని బయటి పొరలో ఒక (1) భాగము సోడియము ఉండగా, కణములోపల ఎనిమిది (8) భాగములు పోటాషియము కలదు. ప్రతి కణములోను సోడియమ్ పోటాషియమ్ రూపములో ఆత్మ పరమాత్మల భాగములు కలవు. ఇది ఒక మానవుని శరీరములోనేకాక ఆత్మలుగల సమస్త జీవరాసులలోను ఇదే సంఖ్య భాగములు (1:8) గానే ఉండును. దీనిని బట్టి సమస్త జీవరాసులలోను దేవుడు సమానముగా ఉన్నాడని తెలియుచున్నది. అలాగే అజ్ఞానులలోను జ్ఞానులలోను దేవుడు 1, 8 భాగములుగ విభజింపబడి తొమ్మిదిగానే ఉన్నాడని తెలియుచున్నది.

పరమాత్మను ఒక్కడినే చెప్పవలసి వచ్చినపుడు దేవుడు అన్నిటికంటే పెద్దవాడు కనుక సంఖ్యలలో పెద్దదైన తొమ్మిదినే చెప్పవలెను. జీవుడు శరీరమంతటలేడు కావున పరమాత్మ ఆత్మలను ఇద్దరినే చెప్పునపుడు శరీరమంతా వ్యాపించియున్న కణజాలములలోని రెండుగనున్న కణ భాగములను చెప్పుకోవలెను. ఒక్కచోటనున్న జీవాత్మను కూడ కలిపి చెప్పవలసి వచ్చినపుడు మూడు అంచలుగనున్న ఆత్మల సంఖ్యను చెప్పవలెను.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| పరమాత్మ | ----- | 9 | = | 9 | = | 9 |
| పరమాత్మ, ఆత్మ | ----- | 18 | = | 9 | = | 9 |
| పరమాత్మ, ఆత్మ, జీవాత్మ | ----- | 963 | = | 18 | = | 9 |

**విశ్వమంతా లేకుండ పోయినప్పటికి మిగులునది పరమాత్మే కావున 27--2+7=9**

దేవుని సంఖ్య మూడు ఆత్మలుగనున్ననూ, రెండు ఆత్మలుగనున్ననూ, చివరకు ఒక ఆత్మగ మారిపోయిననూ దాని విలువ మారకుండనే ఉండును. దేవుడు మాయ సంఖ్యగ ఉన్నపుడు కూడా తన విలువ పెద్దదిగానే పెట్టుకొన్నట్లు తెలియుచున్నది.

**మాయ సంఖ్యగ ఉన్నపుడు 666 - 6+6+6=18 - 1+8=9**

ఈ విధముగ దేవున్ని మానవ శరీరములోని ఆత్మలుగ లెక్కించి నప్పటికైనా, లేక మాయగ లెక్కించినప్పటికైనా తాను మాత్రము ఎప్పటికీ పెద్దనేనని అర్థమగునట్లు చేశాడు.

ఇంతవరకు దేవుడు మూడు భాగములుగా విభజింపబడిన విషయమునూ, ఆ మూడు భాగములకు గణితశాస్త్రములో గుర్తులుగాయున్న 3, 6, 9 అంకెలనూ గుర్తించుకొని తెలుసుకొన్నాము. తెలుసుకొన్నంత వరకు దేవుడు త్రైత సిద్ధాంత రూపములోయున్నట్లూ, దానికి తగిన విధముగా గణితములో మూడు అంకెలున్నట్లూ తెలిసినా, ఆ మూడు అంకెలు తెలుగు భాషలో మొదట పుట్టినవనీ, తెలుగు భాష సృష్ట్యాదినుండి ఉన్నదనీ, తెలుగు భాష దైవజ్ఞానమునకు దగ్గరగాయున్న భాషయనీ, చాలామందికి ఏమాత్రము తెలియదు. అందువలన తెలుగు భాషయందు మొదట దేవుని గుర్తులైన మూడు, ఆరు, తొమ్మిది ఎలా పుట్టినదీ, ఆ మూడు గుర్తులు తెలుగు భాషలో ఏ విధముగా అర్థము నిచ్చుచున్నదీ, మరొక కోణములో కొంత వివరముగా తెలుసుకొందాము.

భగవంతుడు తన భగవద్గీతలో క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అని మూడు ఆత్మలుగా, మూడు (ముగ్గురు) పురుషులుగా, మూడు విలువలుగా దేవున్ని విభజించి చెప్పియుండుట వలన, గణితశాస్త్రములో కూడా అంకెలను బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము తయారు చేయవలసి వచ్చినది. మొదట భారతదేశమంతటా అన్ని ప్రాంతములలో మొత్తము తెలుగు భాష అమలులో ఉండేది, అందరూ తెలుగులోనే మాట్లాడెడివారు. అందువలన గణితశాస్త్రములోని అంకెలను కూడా దేవుని భావము చెడకుండా ఉండునట్లు, దేవుని జ్ఞానమునకు దగ్గరగా ఉండి, దేవుని భావమును బయటికి తెలుపునట్లు, అంకెలను తెలుగు భాషలో తయారు చేయడము జరిగినది. ఆ విధముగా తయారు చేయడము వలన, తెలుగు భాష దైవజ్ఞానమునకు చాలా దగ్గరగాయున్నదని చెప్పుటకు నేడు తెలుగు అంకెలు సాక్ష్యముగాయున్నవి. దైవజ్ఞానమునకు తెలుగు భాష దగ్గరగా

యున్నదని సాక్ష్యము నిచ్చునట్లు, తెలుగు అంకెలు ఎలా తయారైనవో ఇప్పుడు కొంత గ్రహించుకొందాము.

దేవుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా మూడు విధములుగా విభజింప బడినాడని అందరికీ తెలియునట్లు, మూడు గీతలుగాయున్న ఒక అంకెను మన పెద్దలు తయారు చేశారు. ప్రతి మనిషి శరీరములోనూ మూడు ఆత్మలు సమానముగా యుండుట వలన, ప్రతి జీవునికీ ఆత్మ, పరమాత్మ రెండు సమానముగా ఉండుట వలన, మొదట తయారు చేసిన అంకెను మూడు అని పేరు పెట్టడమే కాకుండా, అంకెను మూడు సమాన గీతలుగా ఉండునట్లు తయారు చేశారు. మొదట తయారైన మూడు అంకె జీవాత్మ, ఆత్మ, పరమాత్మలకు ఏ విధముగా గుర్తుగాయున్నదో క్రింది చిత్రపటములో చూచెదము.




మూడు కొమ్ములు ఎడమ ప్రక్కగా గీయబడివున్నవి. మూడు కొమ్ములు లేక గీతలు ఒకే కొలతలో సమాన దూరములో ఉండుట వలన, ఒక శరీరములో మూడు ఆత్మలు సమానముగా ఉన్నవని తెలియుచున్నది. మూడు అంకెలో యున్న క్రింది గీత జీవాత్మగా గుర్తింపబడగా, మిగతా పై

రెండు గీతలు మధ్యలోనిది ఆత్మగా, పైనగలది పరమాత్మగా చెప్పబడుచున్నది. అంతేగాక మూడు అంకెను జీవాత్మకు గుర్తుగాయుంచబడి దానిపైన ఆత్మ, పరమాత్మ అను రెండు ఆత్మలున్నట్లు చూపబడినది. జీవుడు ఎల్లప్పుడూ ప్రకృతివైపే ధ్యాస కల్గియుండును. ప్రకృతి ఆలోచనలలో మునిగి యుండును. ప్రకృతి జనిత గుణముల మధ్యలో నివశించుచుండును కనుక, ఎడమవైపు అనగా జీవునికి కుడివైపుగా ప్రకృతి గలదని ప్రకృతివైపే జీవుడుండుట వలన, జీవునికి కుడివైపు మాత్రము మూడు కొనలున్నట్లు మూడు అంకెలో చూపడము జరిగినది.

ప్రపంచములో అన్నిటికంటే మొదట దైవజ్ఞానమును అనుసరించి జీవాత్మకు గుర్తుగా తెలుగుభాషలోనే మూడు అంకెను తయారుచేశారు. తర్వాత ఏ భాషలో అంకెలు తయారు చేసినా, తెలుగు భాషలోని మూడు అంకెను అనుసరించే తయారు చేసుకొన్నారు. అందువలన అన్ని భాషలకు ఆధారమైనది తెలుగు భాషయని చెప్పవచ్చును. కొందరికి ఇక్కడ ఒక ప్రశ్న రావచ్చును. ఆ ప్రశ్న ప్రకారము మా మాట అసత్యమని అనుకొనుటకు వీలుకలదు. అందువలన ఆ ప్రశ్ననూ, దానికి జవాబునూ మొదట తెలుసు కొందాము. ప్రశ్న ఏమనగా! ఈ మధ్యకాలములో కొన్ని వేల సంవత్సరముల పూర్వము గణితశాస్త్రమునూ దాని అంకెలనూ కనుగొన్నారు. మీరు చెప్పునది సృష్ఠి ఆదిలోనే మొదటి యుగమైన కృతయుగములోనే తెలుగు భాషయున్నట్లు, అప్పుడే జ్ఞానరీత్యా గణితశాస్త్ర అంకెలను తయారు చేసినట్లు మీరు చెప్పుచున్నారు. మిగతా అన్ని దేశములలో కూడా పూర్వము అంకెలు లేవనీ, ఈ మధ్య కాలములోనే గణితశాస్త్ర అంకెలను తయారు చేశారనీ చెప్పగా విన్నాము. అటువంటప్పుడు మీ మాటను మేము ఎలా నమ్మాలి? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు.

సృష్ట్యాదిలోనే దైవజ్ఞానము భూమిమీద తెలియబడినది. అలా తెలియబడిన జ్ఞానమును ప్రజలందరూ తెలుసుకొనునట్లు చేయుటకు కొందరు తెలిసిన జ్ఞానులు, మాటల రూపములో జ్ఞానమును బోధించెడి వారు. జ్ఞానమును బోధించుట వలన కొందరు తెలుసుకోగా, కొందరు బోధ వినుటకు అవకాశము లేనివారు, బోధించువారి వద్దకు పోనివారు జ్ఞానమును తెలియుటకు అవకాశము లేక అజ్ఞానులుగా కొందరుండి పోయారు. దానిని గమనించిన పెద్దలు దేశములోని వారందరూ జ్ఞానులుగా మారుటకు అవకాశము కల్పించవలెనను ఉద్దేశ్యముతోనే కొన్ని ముఖ్యమైన జ్ఞాన విషయములను దృశ్యరూపముగా ఉండునట్లు ఏర్పాటు చేశారు. ఆ ప్రయత్నములో భాగముగా ప్రతి ఊరులోనూ బయలు ప్రాంతములో ఒక ఈశ్వరలింగమును ఉంచెడివారు. ఈశ్వరలింగమును చూచి ముక్కు ముఖము ఆకారమును లేని రాతిగుండును దేనికుంచారని ఎవరైనా అనుకుంటే, దానికి జవాబుగానున్న విషయమును శిలాఫలకము మీద వ్రాసి అక్కడే కనిపించునట్లు పెద్దలు ఏర్పాటు చేశారు. ఒకవేళ ఎవరైనా చదువు రానివారుంటే వారికి వివరమును చెప్పుటకు ఒక బ్రాహ్మణున్ని అక్కడయుంచి బోధించునట్లు ఏర్పాటు చేసి పెట్టారు. అక్కడ బోధించుటకు యున్న బ్రహ్మజ్ఞాని అయిన బ్రాహ్మణునికి కావలసిన పోషణయంతయు ఆ గ్రామ ప్రజలే చూచుకొనునట్లు ఏర్పాటు చేసి పెట్టెడివారు. ఆనాడు దృశ్య రూపముగాయున్న ఈశ్వర లింగమును గురించి చెప్పువానిని "యతి" అని అనెడివారు. యతి అనగా 'యరసినవాడు' అని అర్థము. యరసిన వాడు అనగా 'తెలిసినవాడు' అని భావము. యరసిన అను పదమునుండి యతి అను శబ్ధము పుట్టినది. యతి అనగా జ్ఞాని అని కూడా అర్థము కలదు.

పూర్వము ఈశ్వరలింగమువద్ద నియమింపబడిన యతి లేక జ్ఞాని అనునతడు ఈశ్వరలింగమును గురించి అక్కడకు వచ్చిన వారందరికీ బోధించెడివాడు. ఆనాడు ఈశ్వరలింగము తప్ప ఎటువంటి గుడులూ, గోపురములూ తయారుకాలేదు, ఏమాత్రమూ లేవు. గుడులులేవు అందులో అర్చకులు, పూజారులు లేరు. మొదట ఈశ్వరలింగము తప్ప దైవిక జ్ఞానము నకు సంబంధించినది ఏదీలేదు. లింగమువద్దయున్న యతి లింగమును గురించి చెప్పువాడు మాత్రమేగానీ, పూజారి కాదు. ఆ దినములలో ఈశ్వర లింగమునకు పూజలు చేయలేదు. పూజలు చేయకూడదను నియమము ఉండెడిది. అంతేకాక ఈశ్వర లింగమును ఎక్కడ ప్రతిష్ఠించినా అది బయలు ప్రాంతములోనే ఉండెడిది. లింగమునకు గర్భగుడిని కట్టెడి వారు కాదు. గుడి కట్టడముగానీ, పూజలు చేయడముగానీ చేసెడివారు కాదు. అలా చేస్తే దేవుని జ్ఞానమునకు అర్థమే లేకుండా పోవునని వారికి బాగా తెలుసును. ఈశ్వర లింగమువద్ద నియమింపబడిన వ్యక్తి ప్రతి దినము లింగమును శుభ్రముగా కడిగి తుడిచి పెట్టెడివాడు. అంతేతప్ప పూజలు గానీ, అభిషేకములుగానీ చేసెడివారు కాదు. కాలక్రమేపి లింగము వద్ద యుండు యతి (జ్ఞాని) పూజారిగా మారిపోయాడు. పూజారితోపాటు పూజలు, అభిషేకములు ఈశ్వరలింగమునకు చేయడము జరుగుచున్నది. ఇంకా విచిత్రముగా పూర్వకాల ఆచరణకు విరుద్ధముగా లింగమునకు గుడికట్టడమూ, గర్భగుడిలో లింగము ప్రక్కన పార్వతీదేవి ప్రతిమను పెట్టడమూ, లింగమునకు విరుద్ధముగా బయట నందిని పెట్టడము జరిగినది. ఇదంతయు బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము అశాస్త్రీయము, అధర్మము. అయినా ఎవరూ దానిని పట్టించుకోవడము లేదు. పూర్వము ఈశ్వర లింగమును ప్రతిష్ఠించిన ఉద్దేశ్యముగానీ, జ్ఞానముగానీ, ఈనాడు

ఏమాత్రము లేకుండాపోయినవి. మనము ఆచరించు కార్యములలోనూ మరియు భావములోనూ ఎంతో మార్పు వచ్చినా లింగములో ఎటువంటి మార్పు రాలేదు. పూర్వము ఎలా తయారు చేసిన ఆకారము అలాగేయున్నది. లింగము క్రింద పాణిమట్టము మారలేదు, లింగము మీద మూడు రేఖలు మారలేదు.

లింగమును దేవునికి గుర్తుగా పూర్వము ప్రతిష్ఠించి చూపడము జరిగినది. దేవునికి రూపములేదు, పేరులేదు, కార్యములేదు అను జ్ఞానము మనకు తెలియు నిమిత్తము, ముక్కు ముఖము లేని గుండును దేవునిగా చూపడము జరిగినది. ముఖము లేదు కావున దేవునికి రూపములేదని యతిగాయున్న వాడు ప్రజలకు తెలిపెడివాడు. అంతేకాక లింగము కదలక మెదలకయుండుట వలన దేవునికి పనిలేదని తెలిపెడివాడు. దేవునికి పేరులేదు అని తెలియునట్లు 'ఈశ్వర' అని చెప్పడము జరిగినది. ఈశ్వర అనగా అధిపతియని అర్థముగానీ, అది ఒక పేరుకాదు. దానితో దేవుడు అందరికీ అధిపతియను భావము తెలియుచున్నదిగానీ పేరు తెలియడము లేదు. అందరికీ సర్వసృష్ఠికీ అధిపతియైన దేవుడు మూడు భాగములుగా విభజింపబడియున్నాడని తెలుపు నిమిత్తము లింగము మీద మూడు రేఖలను పూర్వపు జ్ఞానులు పెట్టడము జరిగినది. మూడు తెల్లని విభూతిరేఖలను లింగము మీద చూపడము వలన, దేవుడు భూమిమీద జీవాత్మ, ఆత్మ, పరమాత్మగాయున్నాడని, భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17వ శ్లోకములలో చెప్పిన భావమునకు సరిపోవునట్లు తెలియుచున్నది. ఒక మనిషి శరీరములో దైవము జీవాత్మగా, ఆత్మగా, పరమాత్మగా విభజింపబడియున్నాడని తెలియునట్లు మూడు రేఖలను లింగము మీద పెట్టి చూపడము జరిగినది. ఆ విధముగా లింగము మీద చూపబడిన

మూడు ఆత్మల గుర్తే గణితశాస్త్రములో మూడు అంకెగా తయారైనది. మూడు అంకె ఎలా తయారైనదో, దానిలో మూడు ఆత్మల గుర్తు ఎలావున్నదో, కొంత వివరముగా తెలుసుకొందాము. లింగము మీద మూడు రేఖలు ఎలా ఉన్నాయో అందరికీ తెలుసు. అలా ఉన్న రేఖలలో క్రిందిరేఖ జీవాత్మ గుర్తుయనీ, మధ్యరేఖ ఆత్మకు గుర్తనీ, పైన రేఖ పరమాత్మకు గుర్తనీ ఆనాడు లింగమువద్ద యతిగా (జ్ఞానిగా) యున్న వ్యక్తి తెలిపెడివాడు. మూడు రేఖలు లింగము మీద ఎలా ఉన్నాయో క్రింది చిత్రపటములో చూచెదము.




ఈ మూడు రేఖలు మూడు ఆత్మలుగా మన శరీరములోనే ఉన్నవని తెలియుచున్నది. శరీరములో యున్న మూడు ఆత్మలలో మధ్యలో యున్న ఆత్మ క్రింది జీవాత్మతోనూ, పైన పరమాత్మతోనూ సంబంధము పెట్టుకొనియున్నది. ఆ సంబంధము మనుషులకు తెలియునట్లు మధ్యలో నున్న ఆత్మ రేఖను క్రింది జీవాత్మ రేఖకు అనుసంధానము చేయడము జరిగినది. అలాగే మధ్యరేఖ నుండి పైనగల పరమాత్మ రేఖకు కూడా అనుసంధానము చేయడము జరిగినది. ఎప్పుడైతే మధ్య రేఖనుండి క్రింది రేఖకు, పైరేఖకు అనుసంధానము చేశామో అప్పుడు మూడు అంకె ఆకృతి ఏర్పడుచున్నది. మూడు అంకె ఎలా ఏర్పడినదో తెలియుటకు బాగా అర్థమగుటకు తర్వాత పేజీలో బొమ్మను చూడండి.

తెలుగు భాషలో దైవజ్ఞానమునకు పూర్తి దగ్గరగాయున్న మూడు అంకె మూడు ఆత్మలతోనే ఏర్పడినదని తెలియుచున్నది. మూడు ఆత్మల జ్ఞానమే భగవద్గీతలో చెప్పబడిన విశేష జ్ఞానము. కావున మూడు ఆత్మల సంధానముతో ఏర్పడిన మూడును గ్రహించగలిగితే, అదే జ్ఞానమును బోధించు మిగతా ఆరు, తొమ్మిది యొక్క విశిష్ఠత కూడా తెలియును. శరీరములోని జీవాత్మకు గుర్తుగా మూడు అంకెను, మూడు రేఖలను కలిపి చేసినట్లు ఇప్పుడు మనకు బాగా అర్థమైనది. అదే మూడు రేఖలను జీవాత్మకు కలిపినట్లే కలిపి ఆత్మను సూచించు ఆరుగానూ, పరమాత్మను సూచించు తొమ్మిదిగానూ తయారు చేశారు. ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! ఇదంతయు ఒక్క తెలుగు భాషలోనే సాధ్యమైనది. మూడు, ఆరు, తొమ్మిది అంకెలకు మూడు కొమ్ములు లేక మూడు గీతల కొనలు ఒక్క తెలుగు భాషలోని అంకెలకు మాత్రమే కలవు. మిగతా భాషలలో ఒక్క మూడుకు తప్ప మిగతా అంకెలకు మూడు కొమ్ములు లేవు. తెలుగు అంకెలనుబట్టి మిగత భాషలలోని అంకెలను తయారు చేసుకొన్నారు. కావున మిగతా భాషలలో కూడా మూడుకు మాత్రము మూడు కొనలు కనిపిస్తున్నవి.

ప్రస్తుతము అందరూ గణితశాస్త్రమును తెలిసియున్నా, అంకెలను మాత్రము అందరూ ఆంగ్లభాషలోని అంకెలనే వ్రాయుచున్నారు. తెలుగు వారు కూడా తెలుగు అంకెలను వ్రాయకుండా ఇంగ్లీషు అక్షరములకే అలవాటుపడిపోయారు. కొందరు తెలుగువారికి తెలుగు భాష అంకెలే తెలియకుండాపోయినవి. ఇంగ్లీషు భాషలోని అంకెలను ఏ దానికి ఎన్ని కొమ్ములున్నవో ముందు గమనించితే తర్వాత తెలుగు అంకెల విశిష్ఠత బాగా అర్థమగును. అందువలన ముందు ఈదినము మనము వ్రాయుచున్న ఇంగ్లీషు అంకెలను గమనిద్దాము. 0 1 2 3 4 5 6 7 8 9 ఈ పది అంకెలకు కొమ్ములను గమనించితే ఇలా గలవు.

0

మొదటిది సున్న, సున్నాకు ఒక్కకొమ్ము కూడా ఉండదు. శూణ్యమును తెలుపునది కావున, దీనికి సున్న అని పేరు వచ్చినది.

1 I 2

సున్న తర్వాతవున్న అంకె ఒకటి. ఒకటికి పైన ఒకకొన, క్రింద ఒకకొన మొత్తము రెండు కొనలు లేక రెండు కొమ్ములు గలవు.

1 2 2

ఒకటి తర్వాత రెండు అంకె గలదు. దీనికి కూడా ముందర ఒకటి, వెనుక ఒకటి రెండు కొనలు గలవు.

1 2 3 **3**

రెండు తర్వాత మూడు అంకె కలదు. మూడుకు పది అంకెలలో, లేని మూడు కొనలు కలవు. మూడు కొనలు లేక మూడు కొమ్ములు మూడు ఆత్మలకు గుర్తుగా తయారైనవని ముందే చెప్పు కొన్నాము. ఇది మూడులోని ప్రత్యేకత.

1 3 **4** 2 4

మూడు తర్వాతయున్న నాల్గవ అంకెకు నాలుగు కొనలు గలవు. నాలుగు కొనలు గలది ఏ అక్షరము లేదు. ఒకటికి, రెండుకు రెండు కొనలుండగా, మూడుకు మూడు, నాలుగుకు నాలుగు ఆంగ్ల భాషలో గలవు. నాలుగు యోగమునకు గుర్తుగా యున్నది.

**5** 1 2

నాలుగు తర్వాత ఐదు అంకెను గమనించితే దానికి కూడా పైన వెనుకకు ఒక కొన, క్రింద ముందుకు మరియొక కొన మొత్తము రెండు కొనలు గలవు.

**6** 1

ఐదు తర్వాత ఆరు అంకె గలదు. ఆరు అంకెకు ఒక కొన మాత్రము గలదు. ఆంగ్లభాషలోని ఆరు అంకె కూడా తెలుగు భాషలోని ఆరునుబట్టి తయారు చేసుకొన్నదేనని గుర్తుంచుకోవలెను. ఆంగ్లభాషలోని మొత్తము పది అంకెలలో ఆరుకు, తొమ్మిదికి మాత్రము ఒకే కొనగలదు.

1 7 2

ఆరు తర్వాత ఏడు అంకెగలదు. ఏడును గమనించితే దీనికి కూడా రెండు కొనలు గలవు. 1,2,5 తర్వాత 7 అంకెకు రెండు కొనలుగలవు. ఆంగ్లభాషలో రెండు కొనలు గలవి మొత్తము నాలుగు అంకెలుగలవని తెలియుచున్నది.

8

ఎనిమిది అంకెకు సున్నవలె కొమ్ములు ఒకటి కూడా లేవు. రెండు సున్నల ఆకారముతో ఎనిమిది కనిపించుచుండును. సున్నాకు రెండు కొనలు కలిసిపోయి ఒకకొన కూడా లేనట్లు, ఎనిమిదికి కూడ రెండు సున్నాలు ఉండుట వలన కొమ్ములు లేవు.

9 1

ఎనిమిది తర్వాత తొమ్మిది అంకెగలదు. ఇది ఆరును పైకి త్రిప్పితే తొమ్మిదివలె కనిపించును. ఆరు యొక్క కొమ్ము పైకియుంటే, తొమ్మిది యొక్క కొమ్ము క్రిందికి యుండును. ఆంగ్లభాషలో ఒకే ఒక కొమ్ముగలవి ఆరు, తొమ్మిది మాత్రము గలవు. మూడు కొమ్ములుగల మూడువలెగానీ, ఒక కొమ్ముగల ఆరు తొమ్మిదివలెగానీ ఇతర అంకెలు లేవు. అందువలన 6, 9 ఇంగ్లీషు భాషలోయున్నా తెలుగు భాష వాసనతో తయారైన అంకెలు కావున అక్కడ కూడా తెలుగు భాషలోవలె ప్రత్యేకత 3, 6, 9 అంకెలలో కనిపించుచున్నది. తెలుగులో ఈ మూడు అంకెలు ఎలాగలవో ఇప్పుడు గమనిస్తాము.

ఈశ్వరలింగము మీదగల మూడు ఆత్మల గుర్తులైన మూడు విభూతి రేఖలను ఒకదానితో ఒకటి కలిపినప్పుడు మూడు అంకె తయారైనదని చెప్పుకొన్నాము కదా! మూడు అంకెలో మనము చూస్తే ఎడమ ప్రక్కకు మూడు కొనలుండగా, కుడిప్రక్కన మూడు కొనలు ఒకదానితో కలిసి పోయినట్లు రెండు అనుసంధానములు గలవు. ఎడమవైపుకు ప్రపంచ సంబంధమని అట్లే కుడివైపుకు దైవ సంబంధమని చెప్పుచున్నాము. ప్రతి మనిషిలో కుడిప్రక్క ప్రకృతి సంబంధమూ, ఎడమ ప్రక్క దైవ సంబంధమున్న దని భగవద్గీత అక్షర పరబ్రహ్మ యోగములో జీవుడు మోక్షము వైపుకు పోవాలంటే కాల, కర్మచక్రములలో ఎడమ ప్రక్కకే పోవాలని చెప్పుకొన్నాము. అందువలన మూడు తయారయిన విధానములో కూడ మూడు రేఖలు కుడిప్రక్కన తన కొనలను చూపుచూ అది ప్రపంచ సంబంధ జీవుని గుర్తుగా లెక్కించునట్లు చేశాయి. ఇక్కడ ఎవరూ పొరపాటు పడకూడదని చెప్పడమేమంటే మనము చూచే దానికి ఎడమ ప్రక్క మూడు కొమ్ములు కనిపించినా, మూడుకు మాత్రము కుడిప్రక్కన గలవని జ్ఞప్తికుంచుకోవలెను. ఒక మనిషిని (జీవున్ని) మూడుగా లెక్కించితే అతని ధ్యాస అంతయూ ప్రపంచమువైపు ఉండుట వలన, జీవుని గుర్తుగాయున్న మూడు అంకె యొక్క కొనలు కూడా మూడుకు కుడిప్రక్కనేయుండునట్లు చూపడమైనది. ఎదురుగా చూచు మనకు ఎడమవైపుగాయున్నట్లు కనిపించినా మూడు రేఖల కొనలు దానికి కుడి ప్రక్కకేయున్నాయి.

మూడు రేఖల కొనలను దానికి ఎడమ ప్రక్కగా చూపితే అప్పుడు జీవుని ధ్యాస దైవ సంబంధముగాయున్నదని భావము. అందువలన ప్రపంచ సంబంధ ధ్యాసలేని మనిషి ఆత్మ ధ్యాసలోయుండునని తెలుపుటకు మూడు యొక్క కొనలను త్రిప్పి ఎడమవైపు చూపితే అప్పుడు జీవుని ధ్యాస దైవ

సంబంధముగా యున్నదని తెలియును. అయితే ఇక్కడ దైవ సంబంధము అనగా! జీవునికంటే పెద్దగాయున్న ఆత్మ మీదనా? లేక జీవునికంటే మరియు ఆత్మకంటే పెద్దయిన పరమాత్మ మీదనా? అని ప్రశ్న రాగలదు. ఆ విషయము పూర్తిగా తెలియుటకు మన పెద్దలు ఆత్మకు ఒక గుర్తు, పరమాత్మకు ఒక గుర్తును ఉంచారు. ఎలా అయితే జీవాత్మకు గుర్తుగా మూడు రేఖల కొనలను కుడివైపుకు చూపారో, అలాగే ఆత్మకు గుర్తుగా రేఖలను ఎడమ వైపుకు చూపారు. ఎడమవైపుకు చూపడము వలన దైవ సంబంధము అని తెలిసినా, ఇది ఆత్మకు గుర్తుయన్నట్లు ఎడమవైపు చూపు మూడు రేఖల కొనలలో క్రింది కొనను పై రెండు కొనలకంటే కొంత పొడవు చేసి ప్రత్యేకముగా చూపడము జరిగినది. అలా క్రింది కొన పొడవుగా ఉండుట వలన అది ఆత్మ గుర్తని అందరికీ తెలిసిపోయినది. జీవునికి గణితశాస్త్రములో మూడు అంకె గుర్తుగాయుండగా, ఆత్మకు గుర్తుగా క్రింది కొన పొడవుగా యుండు ఆకారమును చూపుచూ, దానికి ఆరు అని పేరు పెట్టడము జరిగినది. దీనితో ఆత్మకు గుర్తు ఆరుయనీ, జీవునికి గుర్తు మూడుయనీ తెలిసిపోయినది. ఆత్మకు గుర్తయిన ఆరు ఆకారము ఎట్లున్నదో క్రింది చిత్రపటములో చూస్తాము.



**ఆత్మకు గుర్తు**

**ఆరు.**

**6**

— జీవాత్మ

జీవాత్మకు కుడిప్రక్కకు మూడుకొనలుండడమే కాక, మూడుకొనలు సమానముగా యున్నట్లు మనము మూడను అంకెను చూచాము . ఆత్మకు గుర్తయిన ఆరు అంకెలో కూడా మూడు కొనలు మూడు ఆత్మలకు గుర్తుగా యున్నప్పటికీ, మూడు కొనలు ఎడమ ప్రక్కకు ఉండడమూ, అందులో క్రింది కొన ప్రత్యేకముగా మిగతా రెండు కొనలకంటే పొడవుగా ఉండడమును గమనించవచ్చును. ఈ విధముగా తెలుగుభాషలో ఆరును తయారు చేయడమైనది. క్రింది కొన జీవాత్మ రేఖగా చెప్పుకొన్నాము. మూడు కొనలను ఎడమవైపు చూపడములో జీవునికి దైవ ధ్యాస కల్గినదని తెలియవచ్చును. జీవుని రేఖను పొడవుగా ఉంచడము వలన జీవునికి ఆత్మ ధ్యాస కల్గినదని చెప్పవచ్చును. అందువలన ఎడమవైపు క్రింద పొడవుగా యున్న రేఖను చూచి దానిని ఆత్మ గుర్తుగా చెప్పవచ్చును. ఆత్మ గుర్తు ఆరుయని కూడ తెలియవచ్చును. జీవాత్మ గుర్తు మూడుయని, ఆత్మ గుర్తు ఆరుయని తెలియగా, పరమాత్మ గుర్తు ఏదని ప్రశ్న రాగలదు. అందువలన దానికి జవాబుగా జీవాత్మ ఆత్మ పరమాత్మ గుర్తులనుండే పరమాత్మ గుర్తుగా తొమ్మిదిని తయారు చేశారు. పరమాత్మ గుర్తయిన తొమ్మిది తయారయిన విధానమును గమనించితే, ఎడమవైపు కొనలను చూపుచూ, క్రిందికొన పొడవుగా యుంచితే అది ఆత్మకు గుర్తనీ, దానినే ఆరుయనీ చెప్పుకొన్నాము కదా! ఇప్పుడు క్రిందివైపువున్న కొనను పొడవు చేయకుండా మధ్య కొన ఉన్నట్లే కురుచగాయుంచి, పైనగల పరమాత్మ గుర్తుగాయున్న రేఖను పొడవుగా పెట్టడము వలన, అది ప్రత్యేకమయిన గుర్తుగా తయారయి పోయినది. అట్లు తయారయిన గుర్తునే పరమాత్మ గుర్తనీ, అదే తొమ్మిది అంకెగాయున్నదని మన పెద్దలు చెప్పడమైనది. తొమ్మిది యొక్క ఆకారమును ప్రక్కపేజీ చిత్రపటములో ఎలాయున్నదో గమనిద్దాము.




తెలుగు భాష దైవ జ్ఞానమునకు పూర్తి దగ్గరగా యున్నదని చెప్పుకొన్నాము. దానిప్రకారమే తెలుగు అంకెలను కూడా తయారు చేయడ మైనది. మనము ఇప్పుడు ప్రత్యేకించి మూడు, ఆరు, తొమ్మిదిని గురించే చెప్పుకొంటున్నాము. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! కుడివైపు చూపినప్పుడు మూడు కొనలు సమానముగా యుంచి దానినేమో జీవుని గుర్తని, అట్లే మూడుయని చెప్పారు. ఆరు విషయములో చెప్పినప్పుడు ఎడమవైపు కొనలను చూపుచూ జీవుని కొనను పొడవు చేసి, ఇది ఆత్మకు గుర్తుయని దానినే ఆరుయని చెప్పారు. పరమాత్మ విషయములో పై కొమ్మును (కొనను) పొడవు చేసి పరమాత్మ గుర్తుగా చెప్పారు. ఆత్మ విషయములో మధ్య రేఖను పొడవుగా చూపించవచ్చును కదా! ఆత్మకు గుర్తుగాయున్న మధ్యరేఖను వదలి క్రింది జీవాత్మ రేఖను పొడవు చేసి ఆత్మ గుర్తు ఆరు అని చెప్పారు అలా ఎందుకు చెప్పారు? మధ్య రేఖను పొడవుచేసి ఎందుకు చూపలేదు? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు.

జగతిలో ప్రతి మనిషిలోనూ మూడు ఆత్మలున్నా చాలామందికి తెలిసినవి జీవుడు, దేవుడు అనబడు జీవాత్మ, పరమాత్మ మాత్రమే. ఆత్మ అనునది మాటల సందర్భములలో పలుకబడినా అది మాత్రము ఎవరికీ తెలియదు. అంతేకాక మనిషి పుట్టింది మొదలు చనిపోవువరకు అన్ని కార్యములను ఆత్మే చేయుచున్నది. ఇటు జీవుడైనవాడుగానీ, దేవుడుగానీ ఏదీ చేయలేదు. ప్రపంచములోని అన్ని కార్యములను అందరిచేత చేయించునది ఆత్మే అయినా ఆత్మ మాత్రము ఎవరికీ తెలియదు. ఆత్మ అత్యంత గుప్తమైనది. అన్ని పనులను ప్రత్యక్షముగా చేయుచున్నా, ఎవరికీ తెలియకుండా విచిత్రముగా శరీరములోనే ఉండుట వలన, ఆత్మను చిత్రగుప్తుడు అని అంటున్నాము. ప్రపంచములో అన్నిటికంటే రహస్యమైనది ఆత్మే అయినందున, రహస్యముగానే శరీరములో ఎవరికీ తెలియకుండా ఉండుట వలన, దానిని జ్ఞానరీత్యా గుర్తించి చూపలేదు. అది రహస్యమైనదని తెలుపు నిమిత్తమే ఆత్మ యొక్క గుర్తయిన మధ్యరేఖను పొడవు చేసి చూపలేదు. జీవాత్మ పరమాత్మయను రెండు ఆత్మల మధ్యలో ఆత్మ ఉన్నట్లు విభూతి రేఖలలో గుర్తించినా, ఆరు సంఖ్యలో జీవాత్మ గుర్తునే పొడవుచేసి చూపి దానిని ఆత్మ గుర్తుగా చెప్పాము. ఆరు గుర్తుగాయున్న అంకెను తిప్పి పెట్టితే అదే తొమ్మిదిగాయున్నది. తెలుగులో చేసిన ప్రయోగమునే ఇంగ్లీషు భాషలోని ఆరును త్రిప్పి తొమ్మిదిగా చెప్పుకొంటున్నారు. మూడు కొమ్ములు గల ఒకే ఒక గుర్తే మూడు, ఆరు, తొమ్మిదిగా ఉండునట్లు, అది జ్ఞాన అర్థముతో కూడుకొనియుండునట్లు, మొదట పెద్దలు తెలుగులో తయారు చేశారని అందరూ తెలియవలెను.

సృష్టిలేనపుడు ఒక్కడే అయిన దేవుడు సృష్టిలో జగత్తును తయారు చేశాడు. జగన్నాటకమునకు సూత్రధారి అయిన దేవుడు తననుండి తాను తయారు చేసిన జగత్తులోని నాటకమునకు తానే హీరో (కథానాయకుడు)గా ఉంటూ కథనడిచే దానికి లేక ఆటసాగేదానికి ఒక విలన్‌ను (విరోధిని) తయారు చేశాడు. హీరోను పరమాత్మయని పిలువబడగా, విలన్‌ను మాయ అని పిలుస్తున్నాము. ఈ జగన్నాటక కథలో విలన్ ఎప్పుడు హీరోను మించిపోవాలనీ, తానే హీరోగా పేరు తెచ్చుకోవాలనీ ప్రయత్నించు చుండును. జగన్నాటకములోని జీవుళ్లను హీరో అయిన దేవుని చుట్టు చేరకుండ తన చుట్టు చేరేదానికీ, తన నాయకత్వమునే జీవుళ్లు ఒప్పుకోనే దానికి జీవుళ్లను మభ్యపెట్టి తానే హీరోననిపించుకొనే ప్రయత్నము చేయు చుండును. అటువంటి ప్రయత్నములో తాను సులభముగ హీరోవలె చలామణి అవడానికి విలన్ హీరో వేషము వేసుకొని హీరోవలె నటించను మొదలుపెట్టాడు. అంటే మాయ దేవునివలె తన రూపమును మార్చుకొని తానే దేవుడన్నట్లు జీవుళ్లను నమ్మించడానికి మొదలుపెట్టింది. అందువలన కథానాయకుడైన (హీరో అయిన) దేవునికి విరోధి (విలన్) అయిన మాయ జగతిలో తానే దేవుడనిపించునట్లు దేవుని జ్ఞానమని చెప్పుకొను ప్రతిచోట దేవుని జ్ఞానమువలె తన జ్ఞానమును చొప్పించింది. ముఖ్యముగ ప్రజలకు బోధించు బోధకులుగనున్న వారి తలలో దూరి ప్రజలు గుర్తుపట్టనట్లు తన జ్ఞానమును చెప్పించుటకు మొదలుపెట్టినది. పెద్ద పెద్ద స్వామీజీలు, ఇతర మతములలోని బోధకులు, అనేకరకముల గురువులు చెప్పుచున్నది దేవునికి విరోధి అయిన మాయ బోధలేనని చెప్పవచ్చును. దేవుని జ్ఞానమేనని నమ్మి మాయ జ్ఞానమును తమ తలలో నింపుకొన్నవారు దేవునికి వ్యతిరేఖమైన పనులనే చేస్తున్నారు, చేయిస్తున్నారు. చిన్న ఉదాహరణకు చెప్పుకొంటే భగవద్గీతలో దేవుని ప్రతినిధియైన భగవంతుడే విశ్వరూప

సందర్శనమను అధ్యాయములో **"నన్ను చేరుటకుగానీ, నన్ను తెలుసు కొనుటకుగానీ వేదధ్యాయణములు, యజ్ఞములు,దానములు, తపస్సులు పనికిరావు"** అని చెప్పితే, బోధకుల యొక్క మాయ మాటలు విని అదే జ్ఞానమనుకొన్న వారందరూ యజ్ఞములు చేస్తున్నారు, అందులో వేద పఠనములు చేస్తున్నారు. అలాగే దానములు చేస్తున్నారు, మెడిటేషన్ అని పేరుపెట్టి తపస్సులు చేస్తున్నారు. ఇది హిందూ సమాజములోని పనికాగ, క్రైస్తవ సమాజములోనికి వెళ్లి చూస్తే పరిశుద్ధ బైబిలులో దేవుని ప్రతినిధియైన ఏసుప్రభువే మత్తయి సువార్త 23వ అధ్యాయము 9వ వచనములో **"భూమి మీద ఎవనికైనను తండ్రి అని పేరు పెట్టవద్దు. ఒక్కడే మీతండ్రి, ఆయన పరలోకమందున్నాడు"** అని చెప్పియున్నాడు. ప్రభువే చెప్పిన మాటను మభ్యపెట్టి నేడు సాతాన్ (మాయ) మనుషులలోనే బోధకులను తయారుచేసి వారినే తండ్రి అనీ ఫాదర్ అనీ మనుషుల చేతనే పిలుపిస్తున్నది. ఇలా భగవద్గీతలో దేవుడు చెప్పిన వాక్యమునకు వ్యతిరేఖముగ మానవుల చేత యజ్ఞములను చేయించు మాయ, క్రైస్తవులలో మనుషులనే ఫాదర్ (తండ్రీ) అని పిలుచునట్లు చేసి తనే దేవునివలె చలామణి అగుచున్నది. ఇలా చెప్పుచూపోతే మాయ దేవుని స్థానములోనే తిష్టవేసినది. దానికి తార్కాణముగ ఒక విషయము చెప్పుకొందాము. బైబిలునందు చిట్టచివరిలో "పరమార్థ జ్ఞానియగు యోహాను వ్రాసిన ప్రకటన గ్రంథము" అను దానిలో 13వ అధ్యాయములో 18వ వాక్యము **"బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము, అది యొక మనుష్యుని సంఖ్యయే, ఆ సంఖ్య ఆర్నూట అరువది యారు. ఇందులో జ్ఞానము కలదు"** అని ఉన్నది. 13వ అధ్యాయములో మొత్తము అన్ని వాక్యములు చదివి చూస్తే మాయను లేక సాతాన్‌ను మృగము అని అన్నట్లు తెలియుచున్నది. ఈ విషయము యోహాను ప్రకటన గ్రంథము చదివిన ఎవరికైనా అర్థము కాగలదు.

వాక్యములో ఇది యొక మనుష్యుని సంఖ్యయే అని ఉన్నది. మనిషి సంఖ్య అనియున్నది కానీ దేవుని సంఖ్య అని అక్కడ లేదు కదా! సాతాను (మాయ) మనిషిలో సులభముగ చేరుచున్నది. కావున అక్కడ మనిషిలో చేరియున్న సాతాను సంఖ్యగ మనము గుర్తించుకోవాలి. మేము మాయకోడ్ చెప్పినప్పుడు కూడ అజ్ఞానమనిషిని చూచినపుడు మాయ సంఖ్యను గుర్తించుకోవాలి అని ముందే చెప్పియున్నాము. యోహాను ప్రకటన వాక్యములో "బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము" అని ఉంది కదా! దానిలోని వివరము ప్రకారము బుద్ధిగలవాడు అని ప్రత్యేకముగ చెప్పడములో జ్ఞానముకలవాడని అర్థమగుచున్నది. జ్ఞానము కల్గినవాడు అజ్ఞానిని చూచినపుడు వానిలోని మాయను 666 గ గుర్తించునని ముందు పేజీలలోనే చెప్పియున్నాము. తర్వాత అదే వాక్యములో "ఇందులో జ్ఞానము కలదు" అని చెప్పబడియున్నది. దాని వివరమును చూస్తే జ్ఞానము కల్గినవాడు సాధారణ మనిషిలోని మాయను గుర్తించి, మనిషి భావము ప్రకారము లోపలగల సాతాను (మాయను) 666 గ గుర్తించడము జ్ఞాన మార్గములో ఉన్నవారికే సాధ్యమగునని, ఇతరులకు తెలియునట్లు ఇందులో జ్ఞానమున్నదని చెప్పారు. దీనినంతటిని చూస్తే దేవుని జ్ఞానము ప్రకారము జ్ఞానమున్నవాడు జ్ఞానములేనివాని తలలోపలగల మాయను కనుగొనగలడని ఇతరులకు కూడా అర్థమగుచున్నది. ఎంతో స్పష్టముగ సాతాను సంఖ్య 666 అని యోహాను వాక్యములో ఉండగ, మనము ఇంతకుముందే విలన్ హీరోగ చలామణి అగునని చెప్పుకొన్నట్లు, మాయ దేవునిగ ప్రచారము చేసుకొనుచున్నది. అదే విధముగ సాతాన్ మంచిపేరున్న బోధకుని తలలో దూరి తన సంఖ్యను దేవుని సంఖ్యగ ప్రకటింపచేసినది. చిన్న చిన్న బోధకులనుండి చెప్పించితే దేవుని భక్తులైన వారు నమ్మరేమోనని, ఎవరి చేత చెప్పించితే బాగుండునో వారిని ఎన్నుకొని చెప్పించడము వలన

అంతలేనిదే అంత పెద్దాయన చెప్పునా అని తప్పక నమ్ముదురని దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని, జయశాలి అను బిరుదాంకితములుగల బోధకుని చేత "సృష్టికర్త కోడ్ 666" అని ఉపన్యాసములలో చెప్పించినది, గోడల మీద వ్రాయించి నది. దానిని చూచిన చాలామంది దైవభక్తులు గొప్ప దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని అయినవ్యక్తి వ్రాసిన మాట నిజమే ఉంటుంది, అని పూర్తిగ నమ్మి దేవుని సంఖ్యను 666 గ గుర్తించుకొని వారు కూడ సాతాను వలలో చిక్కుకొని పోయారు. ఇది దేవుని సంఖ్యకాదు సాతాను సంఖ్యలని ఎవరూ ఎదురు చెప్పలేక "అది దేవుని సంఖ్యయే అయి ఉంటుంది, దేవుని సంఖ్య కాకుంటే అంతపెద్ద ఆత్మజ్ఞాని అలా చెప్పునా!" అని అనుకొన్నారు.

బైబిలును, భగవద్గీతను రెండింటిని చదివి అందులోని జ్ఞానమును తెలిసిన కొందరు దైవభక్తులు తమ జ్ఞానముచేత 666 అను సంఖ్య ఇటు గీతలో మాయకు గుర్తుగానే కనిపిస్తున్నది, అటు బైబిలోను మాయ (సాతాన్) యొక్క గుర్తుగానే తెలియుచున్నది అని తలచినవారై దేవుని కోడ్ 666 అని ఎలా చెప్పగలిగారో వివరము తెలుసుకోవాలనుకొన్నారు. అలా అనుకొన్న వారు దేవునికోడ్ 666 అని వ్రాసిన దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని అయిన వారియొక్క ముఖ్యమైన శిష్యున్ని దీని వివరము మాకు అర్థముకాలేదు మాకు అర్థమగులాగున వివరించి చెప్పండి అని అడిగినపుడు, మీరు రండి మేము వివరించి చెప్పుతాము అన్నారు. వివరమును చెప్పించు కొనుటకు ముగ్గురు జ్ఞానులు ఆయనవద్దకు వెళ్ళారు. పోయిన ముగ్గురు వినయముగ అడగడము, అడిగినదానికి ఎంతో ఓపికగ దైవజ్ఞాని గారి శిష్యుడు అయిన రాజు వివరముగ జవాబివ్వడము జరిగినది. వారి మధ్య జరిగిన సంభాషణను క్రింద పొందుపరుస్తున్నాము చూడండి. (గమనించ దగిన విషయమేమంటే చెప్పినదానిని వినడమే జరిగినది, కానీ పోయిన ముగ్గురు వ్యక్తులు ఎదురు ప్రశ్నలు వేసి చేప్పే అతనిని ఇబ్బంది పెట్టలేదు.)

**జ్ఞానులు :-** నమస్తే, మిమ్ములను కలిసినందుకు సంతోషముగ ఉందండి.

**రాజు :-** మీపేర్లేమి? మీరు ఏమి చేస్తుంటారు?

**జ్ఞానులు :-** నాపేరు నాయుడు, నేను వ్యాపారము చేస్తుంటాను. నాపేరు చౌదరి నేను ఆర్మీనుండి రిటైర్డయినాను. నాపేరు శశికాంత్ నేను కూడా వ్యాపారమే చేస్తుంటాను.

**రాజు :-** నాపేరు రాజు. నేను ప్రసంగాలు చేస్తుంటాను. మా గురువుగారు రావుగారు. ఆయన ప్రకటించిన వాక్యమే సృష్ఠికర్తకోడ్ 666. ఇక్కడ హైదరాబాద్, సికింద్రాబాద్ అంతటా ఆ వాక్యమును నేనే వ్రాయించాను. సభలు కూడా ఏర్పాటు చేసి ఆ వాక్యమును గురించి ప్రసంగాలు కూడా చేశాము. మీరు దేని వివరము కావాలని వచ్చారు?

**జ్ఞానులు :-** మేము ఇందువులమే అయినా మాకు పరమత ద్వేషము లేదు. మేము ఆధ్యాత్మిక ప్రియులము. కావున భగవద్గీత చదివాము, బైబిలులోని నాలుగు సువార్తలు చదివాము. అందరికి దేవుడొక్కడే అని నిర్ణయముతో ఉన్నాము. మీరు సృష్ఠికర్త సంఖ్యను వ్రాయడము వలన మాకు కొంత ఆశ్చర్యము, అద్భుతము అనిపించింది. అది బైబిలులోని వాక్యమని తెలుసుకొని దానిని వెదకి చదివాము. అక్కడ మాకు అర్థము కాకపోవడమే కాక అది సృష్ఠికర్తకోడ్ కాదేమోననిపించింది. మేము బైబిలులోని పదిపైసలు భాగమైన మత్తయి, మార్కు, లూకా, యోహాను అను నాలుగు సువార్తలను మాత్రమే చదివాము కానీ బైబిలంతా తెలియదు. అందువలన మాకు తెలియని విషయము తమ ద్వారా తెలుసుకోవాలను కొన్నాము.

**రాజు:-** మీరు హిందువులంటున్నారు కాబట్టి నేను ముందుగా అడుగున దేమనగా! మీరు దేవుడొక్కడే అని నమ్ముతారా? లేక దేవతలందరిని నమ్ముతారా?

**జ్ఞానులు :-** మేము మనుషులందరికి దేవుడొక్కడే అని నమ్ముతాము. దేవున్ని తప్ప ఏ ఇతర దేవతలను పూజించము. హిందువులలో మేము కొంత ప్రత్యేకముగ కనిపిస్తుంటాము.

**రాజు :-** సృష్టికర్తకోడ్ 666 అను వివరము మీకు అర్థము కావాలంటే దానిని గురించి చెప్పేదానికి చాలా టైమ్‌పడుతుంది. అంతసేపు మీరు ఓపికగ వింటారా?

**జ్ఞానులు :-** ఎంత టైమ్ పట్టినా వింటాము. మేము పనులన్ని వదులుకొని ముప్పైకిలోమీటర్లు దానికొరకు వచ్చాము.

**రాజు :-** మనముంటున్న భూగోళములో ఒక భాగము భూమి, మూడు భాగములు సముద్రమున్నది. ఒక భాగముభూమి మీదనే చిన్నవి పెద్దవి దాదాపు 360 దేశములు కలవు. అందులో ఒక భారతదేశములో ఆంధ్రప్రదేశ్‌నందు మనము నివశిస్తున్నాము. ఆంధ్రప్రదేశ్‌లో 23 జిల్లాలు కలవు. ఒక జిల్లానే ఎంతో విస్తీర్ణము కల్గియున్నది. అందులో మనమూ మన ప్రదేశము సూక్ష్మాతి సూక్ష్మము. ఒక జిల్లాతోనే పోల్చి చూచితే మనిషి ఎంతో చిన్నవాడు కదా! ఒక రాష్ట్ర విస్తీర్ణముతో పోల్చితే అంతేలేనంత చిన్నవారమైపోతాము. దేశముతో పోల్చి చూచితే లేక్కకే రాము. ఇటువంటి ఎన్నో దేశములుగల భూమికంటే సముద్రము మూడింతలు ఎక్కువగా భూగోళములో ఉంది అనుకొన్నాము. ఇంత పెద్ద భూగోళముకంటే ఎన్నో లక్షలరెట్లు పెద్దది సూర్యగోళము. ఇట్లు మనము ఊహించలేనంత గొప్పదైన సూర్యగోళముకంటే ఎన్నో కోట్లరెట్లు పెద్దవి నక్షత్రములు. అటువంటి ఎన్నో నక్షత్రములు కలిస్తే ఒక పాలపుంత. ఇటువంటి పాలపుంతలు ఎన్నో లక్షలు కలిస్తే ఒక మండలము. అటువంటి మండలములు కొన్ని వేలు కలిస్తే ఒక మహామండలము. అటువంటి మహామండలములు ఎన్ని ఉన్నాయో మానవుని బుద్ధికి అందలేదు. దీనినిబట్టి చూస్తే ఇంత

సృష్టిని తయారుచేసిన వాడు ఎంత గొప్పవాడో చెప్పలేము. ఈ సృష్టిని తయారు చేసినవానిని సృష్టికర్త అంటున్నాము. అంత పెద్ద సృష్టికర్తను గురించి బైబిలులో వ్రాయబడి ఉన్నది. ఏ ఇతర గ్రంథములోలేని విధముగ ఎంతో గొప్పగ బైబిలులో దేవుడు భూమి ఆకాశమును సృష్టించాడని ఉంది.

**జ్ఞానులు :-** భూమిని, ఆకాశమును దేవుడే సృష్టించాడని మేము కూడా విశ్వశిస్తున్నాము. అందులో ఏమాత్రము సంశయములేదు. మాకున్న సంశయము సృష్టికర్తయిన దేవునికి కోడ్ ఉందా? ఉంటే అది ఆర్నూట ఆరువది ఆరుగానే (666) ఎందుకున్నది? ఈ విషయమును ఎవరైనా మమ్ములను అడిగితే మేము వారికి ఏమని సమాధానము చెప్పాలి?

**రాజు :-** ఎవరైన అడిగినపుడు ఇలా చెప్పండి. దేవుడు ఈ సృష్టినంతటిని తయారు చేయుటకు ఆరుదినముల కాలము పట్టింది. ఆరు దినములలో మనిషిని ఆరవరోజు సృష్టించాడు. తర్వాత ఆరురోజులకు సాతాన్‌ను తయారు చేశాడు. అందువలన దేవుని గుర్తును ఆర్నూట ఆరవై ఆరుగ (666) పెట్టుకొన్నాము. ఈ అర్థముతోనే మేము గోడల మీద సృష్టికర్తకోడ్ 666 అని వ్రాశాము. ఎవరైన అడిగితే ఇదే వివరము చెప్పండి.

**జ్ఞానులు :-** సృష్టిని తయారు చేయుటకు ఆరుదినములు పట్టినదన్నారు కదా! ఈ విషయము బైబిలులో ఉన్నదా?

**రాజు :-** బైబిలు ఆదికాండమునందు మొదటి అధ్యాయములోనే ఉన్నది. ఇంటికి పోయిన తర్వాత బైబిలులో పాతనిబంధనలో మొట్టమొదటనే ఉన్న విషయమును చూచుకోండి.

**జ్ఞానులు :-** మీరు గోడకు వేసిన పోస్టర్స్ మీద సృష్టికర్తకోడ్ 666 అని వ్రాసి, క్రింద యోహాను ప్రకటనల గ్రంథము 13వ అధ్యాయము 18వ వాక్యము అని వ్రాశారు కదా! ఆ వాక్యమును చూచితే "బుద్ధిగలవాడు

మృగము సంఖ్యను లెక్కింపనిమ్ము, ఇది యొక మనుష్యుని సంఖ్య" అని ఉంది. ఇందులో జ్ఞానముంది అని కూడా ఉంది. 13వ అధ్యాయములో చివరి వ్యాకమైన 18వ వాక్యమునంతటిని చూచిన తర్వాత, అంతకు ముందు అధ్యాయములోనూ ముందుగల 17 వాక్యములను గుర్తుచేసుకొంటే సాతానును మృగమని చెప్పినట్లున్నది. సాతానైన మృగము సంఖ్య అని ఉండుటవలన ఇది సాతాను సంఖ్యయేమోనని అనుమానము వస్తుంది కదా!

**రాజు :-** వాక్యము చివరలో ఇందులో జ్ఞానమున్నదని ఉంది కదా! దానివలన అది దేవుని సంఖ్యయే అని చెప్పాలి.

**జ్ఞానులు :-** ఇక్కడ మాకు కొంత అర్థము కాలేదు. కొద్దిగ అర్థమయేటట్లు వివరముగ చెప్పండి.

**రాజు :-** మీకు అర్థమయ్యేటట్లు ఒక ఉదాహరణ చెప్పుతాను. కోర్టులో జడ్జి ఉన్నాడనుకో, ఆ జడ్జి ఒక ముద్దాయికి శిక్ష విధించాడు. శిక్షపడిన వానికి జడ్జియే ఒక నంబర్ ఇస్తాడు. శిక్షపడినవానిని ఖైది అంటాము. వానికి ఇచ్చిన నంబరును ఖైదీనంబరు అంటాము. ఖైదీకి 112 నంబరు జడ్జియే ఇచ్చాడు కదా! ఖైదీ దగ్గర మొదట నంబరు లేదుకదా! నంబరును జడ్జియే ఇచ్చాడు కాబట్టి అది జడ్జినంబరే కదా! అలాగే అపవాది అయిన సాతాన్‌కు దేవుడే శిక్షవేసి నంబరు ఇచ్చాడు. అందువలన అది దేవుని నంబరే అవుతుంది. అర్థమైందా?

**జ్ఞానులు :-** ఇక్కడొక చిన్న సంశయము, 112 నంబరును జడ్జి ఇచ్చినప్పటికీ 112 అని పిలిస్తే ఖైదీయే పలుకుతాడు. కానీ జడ్జి పలుకడు కదా! అపుడది ఖైధీ నంబరా? జడ్జీనంబరా?

**రాజు :-** అది ఖైదీనంబరే కానీ ఖైదీనంబరని చెప్పకూడదు. ఇచ్చినవాడు

జడ్జికాబట్టి జడ్జినంబరే అని చెప్పాలి. అలాగే 666 నంబరు సాతానుదే, అయినా ఇచ్చినవాడు దేవుడు కావున అది దేవుని నంబరే అని చెప్పాలి. ఒకప్పుడు సాతానుకు నంబరు లేదు, సాతానుకు దేవుడు శిక్షవేశాడు, నంబరు ఇచ్చాడు.

**జ్ఞానులు :-** ఈ సాతాను ఎవరు? సాతాను దేవునికి వ్యతిరేఖముగా ఎందుకు పని చేస్తున్నది? అపవాది అయిన సాతానుకు దేవుడు శిక్ష ఎందుకు వేశాడు?

**రాజు :-** సాతాను ఒకప్పుడు దేవునికి ముఖ్యమైన ఇంటిమనిషిగా ఉండేవాడు. దేవుని ఇల్లు విశాలమైనది. దేవుని ఇంటిలో ఎందరో పని మనుషులు ఉండేవారు. అందులో సాతాను ముఖ్యమైన పని మనిషి. అలా ఉన్న సాతాను దేవున్ని మోసము చేశాడు. దానిని దేవుడు కనుగొని నీవు నన్ను మోసము చేశావు. కాబట్టి నిన్ను భూలోకమునకు పంపుచున్నాను అని భూలోకమునకు నెట్టివేశాడు. ఆ విధముగ దేవుడు సాతానుకు శిక్ష వేశాడు. దేవుని దగ్గర శిక్షవేయబడి భూలోకమునకు వచ్చిన సాతాను తనకు శిక్షవేసిన దేవుని మీద కోపముకల్గి దేవునికి వ్యతిరేఖముగ మనుషులను మార్చను మొదలుపెట్టాడు. ఆ విధముగ భూలోకములో సాతాను దేవుని రాజ్యము లేకుండ చేసి, తన రాజ్యమును తయారు చేసుకోవాలనుకొన్నాడు. అందువలన ప్రతి మనిషిని దేవుని వైపు పోకుండ, దేవుని జ్ఞానము తెలియకుండ సాతాను చేస్తున్నాడు.

**జ్ఞానులు :-** దేవుని విశాలమైన ఇంటిలో ఎందరో పని చేయువారున్నపుడు, వారు తనను మోసము చేయకుండ దేవుడు మొదటే జాగ్రత్తపడలేదా?

**రాజు :-** ఇంటిలో పనివారన్న తర్వాత ఏదో ఒకటి మోసము చేస్తారని జాగ్రత్తపడిన దేవుడు, పని మనుషల మీద ఆధారపడకుండ ఉండుటకు తనకు సొంతకొడుకులుంటే బాగుండునని అనుకొన్నాడు. ఆ విధముగ అనుకొన్న తర్వాత మొదట క్రీస్తును పుట్టించుకొన్నాడు, తర్వాత ఏసును

పుట్టించుకొన్నాడు. ఆయన కొడుకులలో క్రీస్తు, ఏసు ఇద్దరు ముఖ్యమైన వారు. మిగత కొడుకులను దేవునికున్న ఎన్నో నివాసములలో కొన్నిటిలో వారినుంచాడు.

**జ్ఞానులు :-** క్రీస్తు ఎవరు? క్రీస్తు వేరు ఏసు వేరా?

**రాజు :-** పరిశుద్ధగ్రంథము బైబిలులో మత్తయి సువార్తనందు 1వ అధ్యాయములో 16వ వాక్యమున "ఆమెయందు క్రీస్తు అనబడిన ఏసు పుట్టెను" అని ఉంది. ఈ వాక్యమును బాగా అర్థము చేసుకొంటే క్రీస్తు అనబడిన ఏసుపుట్టెను అన్నపుడు ఇంతకు ముందే క్రీస్తు అనునతడు ఉన్నట్లు అతనే ఇపుడు ఏసుగ పుట్టాడని అర్థమగుచున్నది. క్రీస్తు ఏసు పుట్టకముందే దేవుడైన ఎహోవా కుమారుడు. అందువలన క్రీస్తు అనబడిన అని అక్కడ చెప్పారు. క్రీస్తే ఏసుగా పుట్టాడనీ, క్రీస్తు, ఏసు ఇద్దరు దేవుని కుమారులేనని చెప్పవచ్చును. దీనిప్రకారము ఏసును దేవుని కుమారుడని చాలామార్లు బైబిలులో చెప్పారు.

**జ్ఞానులు :-** దేవుని కుమారుడు ఏసు అని ఒప్పుకుంటాము. కానీ మనమంతా దేవుని కుమారులము కాదా! దేవుడు మనలను పుట్టించలేదా?

**రాజు :-** ఏసుప్రభు ఒక్కడే దేవుని కుమారుడు. మనమంతా సర్పసంతానమే. కావున దేవుని కుమారులము కాదు.

**జ్ఞానులు :-** మీరు చెప్పిన మత్తయి సువార్త, 23 అధ్యాయము,9వ వచనములో "భూమి మీద ఎవనికైనను తండ్రి అని పేరు పెట్టవద్దు, ఒక్కడే మీ తండ్రి. ఆయన పరలోకమందున్నాడు." అని వ్రాయబడియుంది కదా! దీనిప్రకారము మనమంతా దేవుని కుమారులము కాదా?

**రాజు :-** ప్రభువు ఒక్కడే దేవుని కుమారుడు, మనమంతా దేవుని కుమారులము కాదు. దీని విషయము కొరకు లూకా సువార్త, మూడవ

(3) అధ్యాయము, ఏడవ (7) వచనములో చూస్తే "అతడు తనచేత బాప్తిస్మము పొందవచ్చిన జన సమూహములను చూచి సర్పసంతానమా! రాబోవు ఉగ్రతను తప్పించుకొనుటకు మీకు బుద్ధి చెప్పినవాడెవడు" అని ఉంది. బాప్తిస్మమిచ్చు యోహాను దగ్గరకు వచ్చిన జనమును చూచి యోహాను జనమును సర్పసంతానమా అన్నాడు కదా! దానిని బట్టి మనమంతా సర్పసంతానమని తెలియుచున్నది కదా!

**జ్ఞానులు :-** మనమేమైనా సాతాను ప్రభావము వలన బైబిలులోని విషయములను తప్పుగా అర్థము చేసుకుంటున్నామేమో! అలా తప్పుగ అర్థము చేసుకొన్నవారికి తాను చెప్పిన విషయములను తిరిగి జ్ఞాపకము చేయుటకు పరిశుద్ధాత్మే తిరిగి ఆదరణకర్త రూపములో వస్తానన్నదేమో! యోహాను సువార్త 14వ అధ్యాయము, 26వ వాక్యములో **"ఆదరణకర్త అనగా తండ్రి నామమున పంపబోవు పరిశుద్ధాత్మ. సమస్తమును మీకు బోధించి, నేను మీతో చెప్పిన సంగతులన్నిటిని మీకు జ్ఞాపకము చేయును."** అని ఉంది. ఆయన చెప్పిన విషయములన్నిటిని సరియైన అర్థముతో కాకుండ వేరు విధముగ అర్థము చేసుకొన్నపుడు, తిరిగి ఆయన చెప్పిన సంగతులను జ్ఞాపకము చేయవలసి వచ్చినదేమో అనుకుంటున్నాము. ఇంతకీ ఆదరణకర్త ఎవరు?

**రాజు :-** మీకు అర్థమయ్యేదానికి నేనొక ప్రశ్న అడుగుచున్నాను. నీ పేరేమిటి?

**జ్ఞాని :-** నాపేరు శశి అంటారు.

**రాజు :-** శశి అన్న పేరును ఎవరికి పెట్టారు?

**శశి :-** నా శరీరమునకు.

**రాజు :-** అలా అయితే నీవు చనిపోయిన తర్వాత నీ శరీరము ఉన్నప్పటికి

శశికాంత్ చనిపోయాడు అంటారు కదా! కావున శరీరమునకు పేరు పెట్టబడలేదు. శరీరము లోపలి ఆత్మకు పెట్టబడిన పేరు శశికాంత్. ఆత్మ పరిశుద్ధమైనది. నాపేరు రాజు. రాజు అనబడు పేరు నా శరీరములోని పరిశుద్ధాత్మకు పెట్టబడినదేగానీ నా శరీరముది కాదు. ఇపుడు రాజు అనే నేను మీతో మాట్లాడుచున్నాను. అంటే నా శరీరములోని పరిశుద్ధాత్మ మాట్లాడుచున్నదని అర్థము చేసుకోవాలి. నా పరిశుద్ధాత్మే కదా మీకు తెలియని సంగతులను చెప్పుచున్నది. ఆదరణకర్తనే పరిశుద్ధాత్మ అంటున్నాము. ఆదరణకర్త వస్తాడంటే ఎక్కడినుండో వస్తాడని కాదు. మనలోనుండే మాట్లాడునని అర్థము చేసుకోవాలి.

**జ్ఞానులు :-** పరిశుద్ధాత్మను ఆదరణకర్త అని ఎందుకన్నారు?

**రాజు :-** మా ప్రసంగాలు వినండి బాగా అర్థమవుతుంది. మేము 2007 సెప్టెంబరు నెలనుండి డిశంబరువరకు "మా" టీవిలో ప్రసంగాలను ఉదయము పూట చెప్పాము. అవి మావద్ద సి.డిల రూపములలో దొరుకును. మీకు పని ఏమైనా ఉందేమో తర్వాత ఎప్పుడైనా కలుస్తాములేండి.

**నాయుడు :-** మేము అన్ని పనులు వదులుకొని మీకొరకు 30 కిలోమీటర్ల దూరమునుండి వచ్చాము. మీరు చాలాసేపుపట్టుతుంది వింటారా అని అడిగారు. మేము ఎంత టైము పట్టినా వింటామన్నాము కదా! ఇంకా ఒక గంటయినా ఉంటాములేండి.

**రాజు :-** లేదులేండి నాకు కూడ కొద్దిగ వేరేపనియుంది. తర్వాత ఎప్పుడైనా రాండి, అపుడైతే సిడీలు కూడా దొరుకుతాయి.

**ముగ్గురూ :-** సరే అట్లే కానియ్యండి, తర్వాత కలుస్తాము చివరిగ ఒక చిన్న ప్రశ్న అడుగుచున్నాము. ఏసుప్రభువు చనిపోయిన తర్వాత ఎక్కడకు పోయాడు?

**రాజు :-** దేవునికి ఆ లోకములో అనేక నివాసములు గలవు అని బైబిలులోనే ఉన్నది. అలాంటి అనేక నివాసములో దేవునివద్దకు పోయిన వారందరికి ఒక్కొక్కరిని ఒక్కొక్క నివాసములో దేవుడుంచును. దేవుని మార్గమును అనుసరించిన వారందరు దేవుని వద్దకు చేరుదురు. అందమైన దేవుని రాజ్యములో ఎంతో ఆహ్లాదకరమైన నివాసములు గలవు. ఆ నివాసములలో ఒక్కొక్కరికి ఒక్కొక్క నివాసమును ఇచ్చి, దానిలో స్వతంత్రముగ అన్ని సౌఖ్యములను అనుభవిస్తు ఉండునట్లు దేవుడు చేయును. ఏసుప్రభువు కూడా దేవునివద్దకు చేరి అక్కడ దేవుని నివాసములో ఉన్నాడు. బైబిలులో చెప్పిన జ్ఞానమును అనుసరిస్తే ఎవడైనా దేవునివద్దకు పోవచ్చును. దేవుని రాజ్యములో నివాసముండవచ్చును. ఏసుప్రభువు కూడా భూమిమీదకు రాకముందు దేవుని వద్దయుండెడివాడు. ఆయన దేవుని రాజ్యము నుండి వచ్చాడు, కనుక ప్రజలతో నా రాజ్యము వేరుగా ఉన్నదన్నాడు.

ఈ విధముగ వారి సంభాషణ కొనసాగింది. ఆ విషయములన్నిటిని ఆ ముగ్గురి ద్వారా మేము తెలుసుకోవడము జరిగినది. ఇదంతయు దేవునికి సంబంధించిన విషయము కావున ప్రతి ఒక్కరికి దానిని తెలుసుకోనేదానికి గానీ, చెప్పేదానికిగానీ హక్కు ఉంది. తెలియనపుడు ఎవడైనా తెలుసు కొంటాడు. కానీ తెలియచెప్పేవాడు తనకు తెలిస్తేనే చెప్పాలి. లేకపోతే గ్రుడ్డివారు మరోగ్రుడ్డివానికి దారిచూపునట్లుండును. మేము ఈ సంభాషణ అంతా విన్న తర్వాత మాలో ఎన్నో సంశయములు బయలు దేరినవి. వాటి క్రమమును క్రింద పొందుపరుస్తున్నాము.

దేవుడు సమస్తమును ఆరురోజుల లోపల సృష్ఠించాడని చెప్పినపుడు, అందులోనే ఆరవరోజున మనిషిని సృష్ఠించాడని చెప్పినపుడు, తర్వాత ఆరు రోజులకు సాతాన్‌ను తయారు చేశాడని చెప్పినపుడు వినేదానికి బాగానే

ఉంది. దానిని మూడు ఆర్లుగ చెప్పడము గాడితప్పిన పనియైనది. దేవుడు భూమి ఆకాశములతో సహా సమస్తమును మరియు మనిషిని సృష్ఠించుటకు ఆరుదినములు పట్టినది, తర్వాత ఆరుదినములకు సాతాన్‌ను తయారు చేశాడు. ఇక్కడ ఎటుచూచిన రెండు ఆరులే అగుచున్నవి. మూడవ ఆరును ఎక్కడనుండి తేవాలి. ఇక్కడ మూడు ఆరులను అనగా 666 అని చెప్పుట శాస్త్రబద్ధతకానీ, సూత్రబద్దతకానీ ఏమాత్రములేని విషయము. వెనుకనుండి ముందుకు చూచినప్పటికీ, ముందునుండి వెనుకకు చూచినప్పటికీ ఆర్నూట ఆరవై ఆరు (666) రాదు. కేవలము ఆరువై ఆరు (66) మాత్రమే వచ్చును. మానవునితో సహా సృష్ఠినంతటిని తయారు చేయుటకు కేవలము ఒక ఆరు (6) దినములే పట్టాయనీ, తర్వాత సాతాన్‌ను తయారు చేయుటకు మరియొక ఆరు (6) రోజులు పట్టాయనీ చెప్పినపుడు మొత్తము 12 దినములే అగును. 12 ను రెండు భాగములుగ చేస్తే రెండు ఆర్లే అగును. ఆ లెక్క ప్రకారము 66 అగును. లేదు కాదు అనీ సాతాన్ పుట్టుకను ప్రత్యేకముగా చెప్పినట్లు మనిషి పుట్టుకను మాత్రము ప్రత్యేకమైన దినముగా చెప్పుచున్నామనీ, దాని ప్రకారము భూమి చెట్లు పక్షుల యొక్క సృష్ఠి దినముల సంఖ్య ఆరు (6) కాగ, మనిషి సృష్ఠి ప్రత్యేకముగ ఆరు (6) కాగ, సాతాను యొక్క పుట్టుక మరియొక ఆరు (6) అయినదని కూడా లెక్క సరిచేసి చెప్పవలెనని చూచినా అది సరిపోని లెక్కనే అగును. ఎట్లనగా! మనిషి తప్ప మిగత సృష్ఠిని ఐదు (5) దినములుగ లెక్కించుకోవలసి వచ్చును. తర్వాత మనిషిని ఒక (1) దినముగ లెక్కించుకోవలసివచ్చును. ఆ తర్వాత సాతానును ఆరవ (6) దినమునకు లెక్కించవచ్చును. ఈ లెక్కప్రకారము మనిషిని ప్రత్యేకముగ చెప్పితే 516 అగును. అపుడు 666 అని చెప్పక 516 అని చెప్పవలెను కదా! 516 ప్రకారమైతే పంద్రెండు (12) దినములకు సరిపోవును.

మన లెక్క అంతయు వదలివేసి అటురావుగారుగానీ, ఇటు రాజుగారుగానీ చెప్పిన లెక్కప్రకారము ఆర్నూట అరువది ఆరు (666) అను సంఖ్యయే సరియైనదని అనుకొందాము. ఆ సంఖ్యను దేవుని గుర్తుగ పెట్టుటకు ఆధారమేమిగలదు? అదంతయు ప్రకృతీ అందులోని జీవరాసులూ తయారైన సంఖ్య కావున అది ప్రకృతికి వర్తిస్తుంది, కానీ దేవునికి ఎలా వర్తిస్తుంది? అని అడిగితే దీనికి జవాబుండదు.

ఇలా మేము ప్రశ్నించి అడిగామనుకో దేవుని విషయములో అడ్డము మాట్లాడు అజ్ఞానులుగా మమ్ములను అనుకోవచ్చును, మీరు బైబిలు చదవ లేదు, చదివి చూడండి తెలుస్తుంది అని అనవచ్చు, దేవుని విషయములో ఇలా మాట్లాడడము వలన పాపమొస్తుంది అనవచ్చును. దానికి జవాబుగ నేనూ అదే మాటలంటున్నాను. మీరు బైబిలు చదవలేదు, ఒకమారు జాగ్రత్తగ చదవండి తెలుస్తుంది అంటున్నాను. దేవుని విషయములో భయములేకుండా, అడ్డముగా అబద్దపు మాటలను మాట్లాడితే భయంకర పాపమొస్తుందంటున్నాను. బైబిలు ఎప్పటికీ పరిశుద్ధగ్రంథమే. అందులోని పరిశుద్ధతను గ్రహించక, శాస్త్రబద్దత లేకుండ మాట్లాడితే, బైబిలును దేవున్ని అపరిశుద్ధము చేసినట్లు కాదా? బైబిలులో ఏసుప్రభువు చరిత్రగల నాలుగు సువార్తలే ఆణిముత్యములలాంటివి. నాలుగు సువార్తలతోనే అది పరిశుద్ధ గ్రంథముగ కీర్తికెక్కినది. అందులోని ఏసుప్రభువు మాటలు ఆనాటికీ నేటికీ ఏనాటికీ వెలకట్టలేని వజ్రములలాంటివి. అంతవిలువైన ప్రభువు మాటలను వదలి బైబిలును ఇష్టమొచ్చినట్లు చెప్పుకోవడము మనుషులైన వారికి తగిన పనేనా అంటున్నాము? ఏకంగా సాతాను సంఖ్య అయిన ఆర్నూట అరువది ఆరు (666) సంఖ్యను దేవుని సంఖ్యగ చెప్పడము చేయవలసినపనేనా? అని అడుగుచున్నాము.

మాకు అర్థము కాలేదు వివరముగా చెప్పండని కోడ్‌గా చెప్పిన 666 ను గురించి ముగ్గురు అడుగగా రాజుగారు ఒక ఉపమానము చెప్పారు. "ముద్దాయికి జడ్జిగారు 112 అను నంబరు ఇచ్చినపుడు అది జడ్జిదే కదా! జడ్జి ఇచ్చినదేకదా! 112 ముద్దాయిదే అయినప్పటికి అ నంబరు జడ్జిదే అని చెప్పవలెను. అందువలన ఆర్నూట అరువది ఆరు (666) ను సాతాను నంబరు కాదు సృష్ఠికర్తదే అంటున్నామని" వివరించారు. విన్న ముగ్గురికి ఆ విషయము తప్పు అని తెలిసినప్పటికి ఎదురు మాట్లాడకుండ దానిని అంతటితో వదిలేశారు. కానీ మేము అడుగునదేమనగా? రాజుగారు తెలివిగ చెప్పి ఒప్పించాలని చూచినప్పటికి అది సరియైన ఉపమానము కాదు, సరియైన సమాధానము కాదు. ఎందుకనగా! 112 అని పిలిచినపుడు ముద్దాయి పలుకుతాడా? జడ్జి పలుకుతాడా? ఏ విధముగ చూచినప్పటికి ముద్దాయే పలుకుతాడని చెప్పవచ్చును. ఒకవేళ 112 అను నంబరును జడ్జి ఇచ్చినప్పటికీ ఇచ్చిన తర్వాత అది ఖైదీనంబరే అవుతుంది కానీ జడ్జినంబరు కాదు. ఇతను పలానా ఖైది అని గుర్తించుటకు పెట్టిన నంబరే కానీ అది జడ్జీని గుర్తించుటకుకాదు. ఖైదీ నిమిత్తము రికార్డులో ఖైదీనంబరు 112 అని వ్రాస్తున్నారుగానీ, జడ్జినంబరుగా రికార్డులో వ్రాయలేదు కదా! ఆ విధముగనే మాయ నిమిత్తము జగతిలో చెప్పుచున్నపుడు మాయ నంబరు ఆర్నూట అరువది ఆరు (666) అని చెప్పుచున్నాము. ఖైదీనంబరును ఖైదీనంబరుగా చెప్పకుండ ఆ నంబరును జడ్జినంబరుగా చెప్పితే ఎంత తప్పగునో అలాగే మాయ నంబరును మాయనంబరుగా చెప్పకుండ సృష్ఠికర్త (దేవుని) నంబరుగా చెప్పడము అంతే తప్పగును. సృష్ఠికర్త నంబరు 666 అనుట సరియైనదేనా అని చాలామంది క్రైస్తవుల బోధకులైన ఫాదర్‌లను, పాస్టర్లను మరికొంత మంది క్రైస్తవులను విడదీసి అడిగితే ఆరువందల అరువది ఆరు (666) సాతాన్

(మాయ) నంబరే అని ఒప్పుకొంటున్నారు. ఈ ప్రకారము రాజు గారుగానీ వారి గురువుగారైన రావుగారుగానీ మాట్లాడిన సృష్టికర్తకోడ్ 666 అను విషయము పూర్తి తప్పు అని తెలిసిపోవుచున్నది. దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని, జయశాలి అను పేరు పెట్టుకొన్న రావుగారు చెప్పడము దానిని రాజుగారు వ్రాయడము దేవునికి వ్యతిరేఖమైన పనికాదా?

రాజుగారు తన మాటలలో దేవునికి అనేక నివాసములున్నవి అన్నాడు. ఆ నివాసములలో కొందరిని దేవుడుంచునని కూడ చెప్పాడు. దీనినిబట్టి చూస్తే దేవునిది ఎక్కడో ప్రక్కనున్న ప్రదేశమని, ప్రత్యేకమైన ప్రదేశము కొంతమేర వ్యాపించియున్నదని, అదంతయు దేవుని సామ్రాజ్య మని, అక్కడ అందమైన భవంతులు కలవని అర్థమగుచున్నది. దీని ప్రకారము దేవుని రాజ్యమునకు ఎల్లలున్నవని కూడా తెలియుచున్నది. ఇదంతయు రాజుగారి భావము ప్రకారమున్నది. మేము చెప్పునదేమనగా! దేవుడు సర్వవ్యాపి, అణువణువున వ్యాపించి పరమాణువులో కూడా ఉన్నాడు. తాను లేని స్థలముగానీ, తాను చూడనిదేదికానిలేదు. అందువలన దేవున్ని సర్వవ్యాపి, సర్వదర్శి అని అనుచున్నాము. భూమికానీ, ఆకాశముకానీ, నక్షత్రగోళములుకానీ, సూర్యమండలములుగానీ అన్నిటిలోనూ దేవుడు వ్యాపించియున్నాడు. కావున విశ్వమంతా ఆయన రాజ్యమే. విశ్వమునకంతా ఆయన అధిపతియే. దేవుని రాజ్యముకాక ఇంకొకటిలేదు కావున దేవుని రాజ్యమునకు ఎల్లలు లేవని చెప్పవచ్చును. దేవుడు నిరాకారుడు ఆయన ప్రాణమున్న వాటిలోను ప్రాణములేనివాటిలో కూడా అణువణువున వ్యాపించినవాడు. అంతటా ఉన్నవాడు దేవుడు కనుక ఆయనకు అనేక నివాసములున్నాయన్నారు. అనేకము అనగా ఒకటికంటే ఎక్కువ అని అర్థము. కానీ కొన్ని అని అర్థము చేసుకోకూడదు. కొన్ని తనవంటే మరికొన్ని తనవికాదనేగా అర్థము. అందువలన కొన్నికాక అన్నీ

నివాసములు ఆయనవే. ఆయన నివాసములేని ఏ అణువు కూడ లేదు. ప్రతి పదార్థములోను సాక్షియై దేవుడున్నాడు.

సర్వవ్యాపి, సర్వదర్శి అయిన దేవునికి సాతాను ముఖ్యమైన పని మనిషి అనీ, సాతాను దేవున్ని మోసము చేశాడనీ రాజుగారు చెప్పారు. దేవుడేమైన ఒక మనిషిలాంటివాడా అతనిని సాతాను మోసము చేయడానికి రూపముగానీ, నామముగానీ, క్రియలుగానీ లేని దేవునికి ఇల్లూ, ఇంటిలో పనీ ఉండునా? ఆయన చేయవలసిన పనిగానీ, ఆయనకు కావలసిన పనిగానీ ఏమిలేదు. ఎప్పుడైన మనుషులకు తన ధర్మములను తెలియ జేయుటకు తన కుమారుని రూపముతో తన ప్రతినిధిగా ఒక మనిషిని భూమిమీదకు పంపును. భూమిమీదున్న తన పుత్రుడు మనుషులకు కావలసిన జ్ఞానమును బోధించి తిరిగి తండ్రిలోనే చేరిపోవును. తండ్రియైన దేవుడు కుమారుడైన ప్రవక్త విడివిడిగ ఉన్నప్పటికి ఇద్దరు ఒక్కటే. అందువలన నాతండ్రిమాటలు నామాటలు రెండు ఒక్కటేననీ, నన్ను చూచిన వాడు నాతండ్రిని చూచినట్లేనని ప్రభువు చెప్పాడు. ప్రభువు చనిపోయిన తర్వాత దేవునిలో ఐక్యమై పోయాడు. కావున నేను పోవు చోటికి మీరెవరు రాలేరని మనుషులతో చెప్పాడు. దేవుడు కొన్ని వేల యుగముల కొకమారు భూమిమీదకు మనిషిరూపములో వచ్చి జ్ఞానమును బోధించి పోవును. ఆయనకు అంతకంటే వేరు పనిలేదు. అటువంటి దేవునికి పని మనుషులని చెప్పడమూ, పని మనిషి అయిన సాతాను దేవున్ని మోసము చేశాడనడమూ వాస్తవ విషయమగునా? అంతేకాక పని మనుషులు తనను మోసము చేస్తారని, దేవుడు తన స్వంతకొడుకులను పుట్టించుకోవాలను కొన్నాడని రాజుగారు చెప్పడము మరీ విచిత్రముగా ఉన్నది. దీనిని గురించి మేమేమనుచున్నామంటే! సమస్త జీవకోటి దేవుని సంతానమై ఉన్నది. సృష్టికర్త దేవుడైనపుడు అందరికి ఆయన తండ్రికాక ఏమౌతాడు. జగతి

అంతా ఆయన సంతానమే అయినపుడు స్వంత కొడుకులను పుట్టించు కోవాలనుకోవడమేమిటి? దేవున్ని గొప్పగ పోల్చుకోక మనవలె పోల్చుకుంటే ఇల్లూ, ఇంటిలో పనిమనుషులూ, స్వంతకొడులుండవచ్చును. దేవునికి ఒక ఇల్లుగానీ, పనిమనుషులుగానీ, స్వంతకొడుకులుగానీ ఎవరులేరని తెలియవలెను. దేవుని మార్గములో లేకుండ, దేవుని జ్ఞానమును అనుసరించకుండ, మాయ (సాతాన్) మార్గములో నడుచువానిని సర్ప సంతానమని చెప్పారు. సర్పము మాయకు గుర్తు అందువలన మాయలో నున్న వారిని సర్పసంతానమనుట జరిగినది. సర్పసంతానము అనబడు వారు దేవుని సంతతివారేనని తెలియాలి. బైబిలులో ఆత్మకు గుర్తుగ పావురమును (పక్షిని), మాయకు గుర్తుగ కొండశిలువ పామును (సర్పమును) చెప్పుకొన్నాము. దీనిప్రకారము దైవమార్గములోని వారు పక్షిసంతానమనీ, మాయమార్గములోనివారు సర్పసంతానమని గుర్తింపుకు చెప్పినదే. పక్షి సంతానము పాము సంతానము రెండు దేవుని సంతానమేనని తెలియాలి. ఏ విధముగ జ్ఞానిని చూచినపుడు దేవుని సంఖ్య 963 ను, అజ్ఞానిని చూచినపుడు మాయసంఖ్య 666 ను గుర్తు చేసుకొన్నట్లు సాతాన్ (మాయ) మార్గములోని వారిని సర్పసంతానము అంటున్నాము.

విశ్వ సృష్ఠిని గురించి బైబిలు పాతనిబంధన ఆదికాండములో మొదటి అధ్యాయమునందు చూడండి అని రాజుగారు చెప్పాడు. ఆయన మాట ప్రకారము ఆదికాండములోని ఆది అధ్యాయములో ఒకటినుండి ఐదు వాక్యముల వరకు చదివితే ఈ విధముగా ఉన్నది. "1. ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. 2. భూమి నిరాకారముగాను శూణ్యముగాను ఉండెను. చీకటి అగాధ జలముపైన కమ్మియుండెను. దేవుని ఆత్మ జలముల పైన అల్లాడుచుండెను. 3. దేవుడు వెలుగు కమ్మని పలుకగా వెలుగు కలిగెను. 4. వెలుగు మంచిదైనట్టు దేవుడు చూచెను.

దేవుడు వెలుగును చీకటిని వేరుపరచెను. 5. దేవుడు వెలుగును పగలనియు, చీకటిని రాత్రి అనియు పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను.” ఈ ఐదు వాక్యములు బైబిలులో మొట్ట మొదటి వాక్యములు. ఇక్కడ మేము అడుగునదేమనగా! మొదట భూమి నిరాకారముగాను శూణ్యముగాను ఉండగా, అగాధజలముపైన చీకటి కమ్మియుండగా, దేవుని ఆత్మ జలములపైన అల్లాడుచుండెను. అని వ్రాయబడియున్నది కదా! అక్కడ చెప్పిన దానిని ఊహించుకొంటే అగాధమైన జలములు వాటిపైన గాఢమైన చీకటి చీకటిలో దేవుని ఆత్మ నీటిమీద తేలియాడడము అంతా ఒక దృశ్యరూపముగ బుద్ధికి గోచరిస్తున్నది. దీనినంతటిని మొదట ఎవరైన చూచియుంటేనే కదా అక్కడ పరిస్థితిని వర్ణించి చెప్పేది. సృష్ఠికంటే ముందు ఎవరున్నారు? అక్కడున్నవాడు ఎవడో చీకటిని జలములను, జలముల మీద దేవున్ని చూచియుండాలి. అంత చీకటిలోను వెలుగులేనపుడే జలములను దేవున్ని చూచినవాడు, దేవుని సృష్ఠికంటే ముందున్న వాడు ఎవడో కాని వాడు సృష్ఠికంటే ముందూ, దేవునికంటే పెద్దవాడైయుండాలి. అలా సృష్ఠికంటే ముందుయుండి చీకటిలోనే దేవున్ని ముందే చూచిన వాడైవడైనా ఉండగలడా? ఈ విషయమును గ్రుడ్డిగనమ్మక ప్రతి క్రైస్తవుడూ, ప్రతి మనిషీ ఆలోచించి తీరవలసిందే. ఇలా మొదట చెప్పిన రెండు వాక్యములు దేవున్ని ఘనపరచగలవా? హీనపరచగలవా? యోచిస్తే ఇందులో దేవున్ని ఘనపరుచు విధానము లేదు. దేవునికంటే ముందే, సృష్ఠికంటే ముందే, మరియొకనిని ఘనపరచినట్లున్నది. దేవునికంటే పెద్ద ఎవరూ లేరని నమ్మిన విశ్వాసులలో కూడా అనుమానమును, అవిశ్వాసమును కలుగజేయునట్లు మొదటిలోనే రెండు వాక్యములు గలవు. ఏది ఏమైన సృష్ఠి పూర్వము ఉండి చూచినవాడెవడో ఎవరైనా చెప్పగలరా? ఎవరూ చెప్పలేరు!

ఎక్కడా ఖండింపబడనిది దేవుని జ్ఞానము. దేవుని జ్ఞానమును తెలిసినవాడు జ్ఞానవిషయములో ఎవడు ఏ ప్రశ్న అడిగిన జవాబు చెప్పు స్థోమత కల్గియుండును. దేవుని జ్ఞానము ప్రకారము జవాబు చెప్పితే దానిని పద్ధతి ప్రకారము మాట్లాడువాడు ఎవడూ కాదని చెప్పలేడు, ఖండించి మాట్లాడలేడు. ఆ విషయమునే ఏసుప్రభువు చెప్పినట్లు లూకా సువార్త 21వ అధ్యాయము 15వ వచనములో కలదు. **"మీ విరోధులు ఎదురాడుటకు వీలుకాని వాక్కును జ్ఞానమును నేను మీకు అనుగ్రహింతును"** అంతేకాక **"ఆకాశము భూమియు గతించును కానీ నా మాటలు ఏమాత్రము గతింపవు"** అని ప్రభువు మత్తయి సువార్త 24వ అధ్యాయము, 35వ వచనములో చెప్పియున్నాడు. ఈ విధముగ ప్రభువు చెప్పిన జ్ఞానము ఎక్కడా ఖండింపబడక పూర్తిగ శాస్త్రబద్ధమై ఉండునని తెలియుచున్నది. బైబిలులో అదియు క్రొత్తనింబధనలో గల ప్రభువు యొక్క మాటలు గల నాలుగు సువార్తలలోని జ్ఞానమును ఎవరూ ఖండించుటకు వీలులేదు. ఎందుకనగా అవి స్వయముగ దేవుడు చెప్పిన వాక్యములు. ఇక్కడ దేవుడు చెప్పాడా? ప్రభువు కదా చెప్పినది అని అనుకోకుండ ఈ విషయములో ఎవరికీ అనుమానము రాకుండా ముందే ప్రభువు ఈ విధముగ చెప్పాడు. యోహాను సువార్త, 7వ అధ్యాయము, 16వ వాక్యములో **"నేను చేయు బోధ నాదికాదు. నన్ను పంపినవానిదే"** ఈ రెండు వాక్యములను చూచితే దేవుని వాక్యములు ఎంత బలమైనవో అర్థమౌచున్నది. ఏ నాస్తికవాదిగానీ, ఏ హేతువాదిగానీ ఖండించుటకు వీలులేని వాక్యములై యుండును. కానీ ప్రభువు మాటలను వదలి మిగతా బైబిలంతటిని చూస్తే అందులో దేవుని మీదనే అనుమానమును కలిగించు వాక్యములు ఉన్నవి. అందువలన బైబిలులో పరిశుద్ధత అంటే ప్రభువు జ్ఞానముగల నాలుగు సువార్తలలోనే గలదని మేము చెప్పుచున్నాము. బైబిలు పరిశుద్ధ

గ్రంథము, మహిమగల గ్రంథము అనడానికి నాలుగు సువార్తలే ముఖ్య కారణము. ప్రభువు పలికిన మాటల ముందర మిగత బైబిలంతా సారము లేనిదే అని చెప్పవచ్చును. అందువలన మిగతా బైబిలులోని విషయములను ఎవరైనా విమర్శించుటకు ఖండించుటకు అవకాశము గలదు. కానీ బైబిలు క్రొత్త నిబంధనలోని నాలుగు సువార్తలను ఎవరు ఖండించలేరని చెప్ప వచ్చును. మిగతా బైబిలు ఎలా హేతువాదుల విమర్శకు లోనవుతూ ఉందో వివరించుకొని చూస్తాము. బైబిలులో మొట్టమొదట ప్రారంభములోనే మొదటి అధ్యాయము ఒకటి రెండు వాక్యములే అనుమానము రేకెత్తించి అవిశ్వాస బీజమును నాటుచున్నవి.

ఇంకనూ చూస్తే దేవుడు సమస్త సృష్ఠిని ఆరుదినములలో సృష్ఠించాడని ఆదికాండము మొదటి అధ్యాయములో గలదు. మొదటి అధ్యాయమంతగల 31 వచనములు, తర్వాత రెండవ అధ్యాయములో 7వ వచనము వరకు చూస్తే ఎంత లోపభూయిష్టముగ ఉందో చూడండి. **1) ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. 2) భూమి నిరాకారముగాను శూణ్యముగాను ఉండెను. చీకటి అగాధజలము పైన కమ్మియుండెను. దేవుని ఆత్మ జలముల పైన అల్లాడుచుండెను. 3) దేవుడు వెలుగు కమ్మని పలుకగా వెలుగు కలిగెను. 4) వెలుగు మంచిదైనట్టు దేవుడు చూచెను. దేవుడు వెలుగును చీకటిని వేరు పరచెను. 5) దేవుడు వెలుగునకు పగలనియు, చీకటికి రాత్రి అనియు పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను.**

**6) మరియు దేవుడు జలముల మధ్యనొక విశాలభాగము కలిగి ఆ జలములను ఈ జలములను వేరుపరచును గాకని పలికెను. 7) దేవుడు ఆ విశాలము చేసి విశాలము క్రింది జలములను విశాలము మీది జలములను వేరు పరుపగా ఆ ప్రకారమాయెను. 8) దేవుడు ఆ**

విశాలమునకు ఆకాశమని పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా రెండవ దినమాయెను.

9) దేవుడు ఆకాశము క్రిందనున్న జలములొకచోటనే కూర్చబడి ఆరిననేల కనపడును గాకని పలుకగా ఆప్రకారమాయెను. 10) దేవుడు ఆరిననేలకు భూమి అని పేరు పెట్టెను, జలరాసికి ఆయన సముద్రములని పేరు పెట్టెను. అది మంచిదని దేవుడు చూచెను. 11) దేవుడు గడ్డిని విత్తనములిచ్చు చెట్లను భూమిమీద తమ తమ జాతిప్రకారము తమలో విత్తనములుగల ఫలమిచ్చు ఫలవృక్షములను భూమి మొలిపించుగాకని పలుకగా ఆప్రకారమాయెను. 12) భూమి గడ్డిని తమ తమ జాతిప్రకారము విత్తనములిచ్చు చెట్లను, తమ తమ జాతి ప్రకారము తమలో విత్తనములు గల ఫలవృక్షములను మొలిపింపగా అది మంచిదని దేవుడు చూచెను. 13) అస్తమయమును ఉదయమును కలుగగా మూడవ దినమాయెను.

14) దేవుడు పగటిని రాత్రిని వేరుపరుచునట్లు ఆకాశవిశాల మందు జ్యోతులు కలుగును గాకనియు, అవి సూచెనలను కాలములను దిన సంవత్సరములను సూచించుటకైయుండుగాకనియు, 15) భూమి మీద వెలుగిచ్చుటకు అవి ఆకాశవిశాలమందు జ్యోతులైయుండుగాకనియు పలికెను, ఆ ప్రకారమాయెను. 16) దేవుడు ఆరెండు గొప్ప జ్యోతులను అనగా పగటిని ఏలుటకు పెద్ద జ్యోతిని, రాత్రిని ఏలుటకు చిన్న జ్యోతిని నక్షత్రములను చేసెను. 17),18) భూమి మీద వెలుగిచ్చుటకును, పగటిని రాత్రిని ఏలుటకును, వెలుగును చీకటిని వేరుపరుచుటకును, దేవుడు ఆకాశ విశాలమందు వాటినుంచెను. అది మంచిదని దేవుడు చూచెను. 19) అస్తమయమును ఉదయమును కలుగగా నాలుగవ దినమాయెను.

20) దేవుడు జీవము కలిగి చలించువాటిని జలములు సమృద్ధిగా పుట్టించును గాకనియు, పక్షులు భూమిపైన ఆకాశ విశాలములో ఎగురును

గాకనియు పలికెను. **21)** దేవుడు జలములలో వాటివాటి జాతిప్రకారము జలములు సమృద్ధిగా పుట్టించిన మహా మత్స్యములను, జీవము కలిగి చలించు వాటినన్నిటిని, దాని దాని జాతిప్రకారము రెక్కలుగల ప్రతి పక్షిని సృజించెను. అది మంచిదని దేవుడు చూచెను. **22)** దేవుడు మీరు ఫలించి అభివృద్ధి పొంది సముద్రజలములలో నిండియుండుడనియు, పక్షులు భూమిమీద విస్తరించును గాకనియు, వాటిని ఆశీర్వదించెను. **23)** అస్తమయములను ఉదయమును కలుగగా అయిదవ దినమాయెను.

**24)** దేవుడు వాటివాటి జాతిప్రకారము జీవముగలవాటిని, అనగా వాటివాటి జాతిప్రకారము పశువులను, పురుగులను, అడవి జంతువులను భూమి పుట్టించునుగాకని పలికెను, ఆ ప్రకారమాయెను. **25)** దేవుడు ఆయా జాతుల ప్రకారము అడవి జంతువులను, ఆయా జాతుల ప్రకారము పశువులను, ఆయా జాతుల ప్రకారము నేలకు ప్రాకు ప్రతి పురుగును చేసెను. అది మంచిదని దేవుడు చూచెను. **26)** దేవుడు తన స్వరూపము నందు తన పోలిక చొప్పున నరులను చేయుదము, వారు సముద్రపు చేపలను, ఆకాశ పక్షులను, పశువులను సమస్త భూమిని భూమి మీద ప్రాకు ప్రతి జంతువును ఏలుదురుగాకనియు పలికెను. **27)** దేవుడు తన స్వరూపమందు నరుని సృజించెను. దేవుని స్వరూపమందు వాని సృజించెను. స్త్రీనిగాను, పురుషునిగాను వారిని సృజించెను. **28)** దేవుడు వారిని ఆశీర్వదించెను. ఎట్లనగా మీరు ఫలించి అభివృద్ధి పొంది విస్తరించి భూమిని నిండించి దానిని లోబరుచుకొనుడి, సముద్ర చేపలను ఆకాశ పక్షులను భూమి మీద ప్రాకు ప్రతిజీవిని ఏలుడని దేవుడు వారితో చెప్పెను. **29)** దేవుడు ఇదిగో భూమి మీదనున్న విత్తనములిచ్చు ప్రతిచెట్టును, విత్తనములిచ్చు వృక్షఫలముగల ప్రతి వృక్షమును మీకిచ్చియున్నాను. అవి మీకాహారమగును. **30)** భూమి మీదనుండు జంతువులన్నిటికిని, ఆకాశ

**పక్షులన్నిటికిని, భూమిమీద ప్రాకు సమస్త జీవులకును పచ్చని చెట్లన్నియు ఆహారమగునని పలికెను, ఆప్రకారమాయెను. 31) దేవుడు తాను చేసినది యావత్తును చూచినపుడు అది చాలామంచిగనుండెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఆరవదినమాయెను.**

**రెండవ అధ్యాయము. ఒకటవ వాక్యమునుండి 1) ఆకాశము భూమియు వాటిలోనున్న సమస్త సమూహమును సంపూర్తి చేయబడెను. 2) దేవుడు తాను చేసిన తన పని ఏడవది దినములోగా సంపూర్తి చేసి, తాను చేసిన తన పనియంతటనుండి ఏడవ దినమున విశ్రమించెను. 3) కాబట్టి దేవుడు ఆ ఏడవదినమును ఆశీర్వదించి పరిశుద్ధపరిచెను. ఏలయనగా దానిలో దేవుడు తాను చేసినట్టియు, సృజించినట్టియు తన పని అంతటినుండి విశ్రమించెను. 4) దేవుడైన ఎహోవా భూమిని ఆకాశమును చేసిన దినమందు భూమ్యాకాశములు సృజింపబడినపుడు వాటివాటి ఉత్పత్తిక్రమము ఇదే. 5) అది వరకు పొలమందిలి ఏ పొదయు భూమిమీదనుండలేదు. పొలమందలి ఏ చెట్టును మొలచలేదు. ఏలయనగా దేవుడైన ఎహోవా భూమిమీద వానను కురిపించలేదు. నేలను సేద్య పరుచుటకు నరుడులేడు. 6) అయితే ఆవిరి భూమినుండి లేచి నేల అంతటిని తడిపెను. 7) దేవుడైన ఎహోవా నేలమట్టితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను.**

ఇపుడు పైన వ్రాసినదంతయు బైబిలు ఆదికాండములోని మొదటి విషయమన్నాము కదా! ఇక్కడున్నదంతయు హేతువాదనకుగానీ, సత్ విమర్శకుగాని నిలువని విషయమని తెలుస్తుంది. వాటిలో కొన్నిటిని మేము అడుగుచున్నాము. మొదటి అధ్యాయములో ఒకటి రెండు వాక్యములను చూచిన తర్వాత మొదట సృష్టియేలేనపుడు, మానవుడే లేనపుడు అప్పుడు

అక్కడున్న పరిస్థితిని ఎవడు చూచి వ్రాశాడు? అని ప్రశ్న వస్తున్నది. 2వ వాక్యములో "భూమి నిరాకారముగాను, శూన్యము గాను ఉండెను" అని అన్నపుడు. మూడవ దినమున దేవుడు భూమిని తయారు చేశాడు అని ఉంది. అంతవరకు భూమిలేదనేగా అర్థము. అలాంటపుడు మొదటి రోజే భూమి నిరాకారముగా శూన్యముగా ఉండెనని భూమిని గురించి ప్రస్తావించారు గదా! ఇందులో ఏ మాట నిజము. మొదటి దినమున్న రెండవ (2) వాక్యములోని భూమి సత్యమా? లేక మూడవదినమున్న తొమ్మిదవ (9) వాక్యములోని భూమి సత్యమా? ఏది సత్యమను అనుమానము రాక తప్పదు. ఇటు రెండవ వాక్యము సత్యమైతే, అటు తొమ్మిదవ వాక్యము అసత్యము కావాలి. అట్లుకాక తొమ్మిదవ వాక్యము సత్యమైతే, రెండవ వాక్యము అసత్యముకావాలి.

రెండవ వాక్యములోనే శూన్యముగా ఉండెనను మాటకూడ కలదు. శూన్యము అనగా ఆకాశమనియేగా అర్థము. గగనమ్ శూన్యమ్ అనుమాట ప్రకారము శూన్యమనిన ఆకాశమనిన రెండు ఒక్కటే. మొదటి దినమున వెలుతురును కూడ సృష్టించకముందే శూన్యమున్నపుడు రెండవదినము దేవుడు ఆకాశమును తయారు చేసెనని చెప్పడమేమిటి? అని ప్రశ్నరాక తప్పదు. మొదటి దినము చెప్పిన శూన్యము ఆకాశము కాదా? రెండవ దినము చేసిన ఆకాశమునకు మొదటిదినమే ఉన్నదని చెప్పిన ఆకాశమునకు ఏమైన తేడా ఉన్నదా? దీని ప్రకారము మొదటి దినము చెప్పిన ఆకాశము సత్యమా? రెండవదినము చెప్పిన ఆకాశము సత్యమా? ఇది కూడ ఇరుకున పడ్డ విషయమే కదా!

ఇకపోతే ఐదవ (5) వాక్యమును చూచినట్లయితే "దేవుడు వెలుగుకు పగలనియు, చీకటికి రాత్రి అనియు పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను" అని ఉంది. ఇక్కడ ఉదయమును

అస్తమయమును తీసుకొని చూస్తాము. ఉదయించడము అనగా పుట్టడము అను అర్థము అందరికి తెలుసును. అలాగే అస్తమించడము అనగా లేకుండపోవడము అనికూడ అందరికి తెలుసు. దీనిప్రకారము పుట్టివచ్చిన కాలమును ఉదయము అని, పుట్టివచ్చినవాడు లేకుండపోయిన కాలమును అస్తమయమని అంటాము. ప్రతి దినము సూర్యుని పుట్టుక కాలమును సూర్యోదయమని అలాగే సూర్యుడు కనిపించక పోవు కాలమును సూర్యాస్తమయని అంటున్నాము. కాని ఐదవ (5) వాక్యము ప్రకారము ఎవరు పుట్టింటే ఉదయమయింది. ఎవరు పోయింటే అస్తమయమయింది అను ప్రశ్న రాకతప్పదు. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను అనియు అలాగే రెండవ దినమాయెను, మూడవ దిన మాయెను అని వ్రాయబడియుంది. సృష్ఠి క్రమములో దేవుడు నాల్గవ దినమున రెండు జ్యోతులైన సూర్యచంద్రులను సృష్ఠించినట్లు, మరియు దినము సంవత్సరములను సూచించుటకే రెండు జ్యోతులను తయారు చేసినట్లు పదునాల్గవ (14) వాక్యములో గలదు. నాల్గవ దినమున సూర్య చంద్రులు తయారు చేయబడి దినముల సంవత్సరముల క్రమము వచ్చి యుంటే మొదటిదినము ఎవరి అస్తమయము ఎవరి ఉదయము ప్రకారము దినమైనదిని చెప్పబడినదను ప్రశ్న ఎవరికైనా రాగలదు. ఒక దినమని అస్తమయమని ఉదయమని ఐదవ వాక్యములో ఉండినపుడు ఎవరి ప్రమాణముతో దినమైనది? ఎవరి ప్రమాణముతో అస్తమయమైనది? ఎవరి ప్రమాణముతో ఉదయమైనది ఎవరైనా చెప్పగలరా?

సృష్ఠిక్రమములో ఐదవ దినమున జీవము కలిగి నీటిలో చలించు చేపలను, భూమిపై ఆకాశములో ఎగురు పక్షులను దేవుడు తయారు చేసెనని 20,21,22 వాక్యములలో గలదు. తర్వాత ఆరవ దినమున మొదట జీవముగల పురుగులను జంతువులను మృగములను తయారు చేసిన

తర్వాత మనిషిని తయారు చేశాడని ఉంది. మనిషిని మట్టితో తయారుచేసి నాసికా రంధ్రములలో జీవవాయువునూదగా నరుడు జీవాత్మ ఆయెను అని 2వ అధ్యాయము 7వ వాక్యములో కలదు. ఇప్పుడు మేము అడుగున దేమనగా! ఆరవ దినము మనిషిని తయారు చేసిన తర్వాత జీవాత్మ తయారైందని చెప్పినపుడు, మూడవ దినమున జీవము కలిగి నీటిలో చలించు చేపలను గాలిలో ఎగురు పక్షులను సృష్టించినట్లున్నది కదా! ఆరవ దినము కూడా మనిషిని తయారు చేయకముందే జీవముగల జంతువులను, మృగములను, నేలమీద ప్రాకు పురుగులను దేవుడు తయారు చేశాడని చెప్పారు కదా! దానిప్రకారము మూడవరోజు నుండే భూమిమీద జీవము (జీవాత్మ) ఉన్నట్లే కదా! అటువంటపుడు ఆరవదినము మనిషిని చేసినపుడు జీవాత్మ ఆయెను అనుట ఏమిటి? అంతకు ముందు మూడవదినమునుండి తయారైన జీవముగల ప్రాణులన్నీ జీవాత్మలు కావా? ఎవరో ప్రక్కనుండి దేవుని సృష్టిక్రమమునంతటిని చూచి వ్రాసిన అతనికి ముందు పుట్టిన జంతువులు పక్షులు చేపలు జీవాత్మలుగ కనిపించలేదా? కనిపించకపోతే జీవముగల వాటిని దేవుడు తయారు చేశాడని ఎలా వ్రాశాడు? ప్రతి విషయము మాకు వివరముగా కావాలనువారికి ఆదికాండములోని మొదటి అధ్యాయము సంశయములేని జ్ఞానమును అందిస్తుందా? లేక అంతా సంశయములతో కూడుకొన్న సమాచారమును అందిస్తుందా? ఈ విధముగ అడుగుతూ పోతే అన్నీ ప్రశ్నలేమిగులును. ఒక్కదానికి కూడా సరియైన సమాధానము దొరకదు. ఇటువంటి అనుమానములతో కూడిన సమాచారమున్నదేదైనా పవిత్రమనిపించుకోదు. అందువలన బైబిలుకు పవిత్రత, పరిశుద్ధత క్రొత్త నిబంధనలోని నాలుగు సువార్తల వలననే వచ్చాయి అనుకోవచ్చును. ఏసుప్రభువు జీవిత పాఠములున్న మత్తయి, మార్కు, లూకా, యోహాను సువార్తలే బైబిలుకు పరిశుద్ధ గ్రంథమని పేరు

తెచ్చాయి. ఆ నాలుగు సువార్తలలోని ప్రభువు జ్ఞానముతోనే బైబిలు గ్రంథమునకు శక్తికూడ ఏర్పడినది. ఏసుప్రభువు చరిత్రయుండుట వలననే దయ్యములు సహితము బైబిలును చూస్తే బయపడుచున్నవి. ఇదంతయు చూస్తే ఆదికాండములోని ఆది అధ్యాయము శాస్త్రబద్ధతలేనిదని తెలియు చున్నది. శాస్త్రబద్ధతలేని అధ్యాయములో సృష్టి విధానమున్నది. కావున దేవుడు ఈ విధముగ సృష్టించియుండడేమోనను అనుమానము వస్తున్నది.

దేవుడు మానవులకు ఏమి చెప్పిన సత్యవచనములే చెప్పును. అసత్యవచనములనుగానీ, అనుమానమొచ్చు మాటలనుగానీ, సందిగ్ధములో పడవేయు వాక్యములనుగానీ చెప్పడు. దేవుడు తెలియజేసిన జ్ఞానము మనుషులు చెప్పిన జ్ఞానముకంటే ఎన్నో రెట్లు గొప్పది. దేవుని జ్ఞానము దేవునికే తెలుసును, మనుషులకు ఎవరికీ తెలియదు. అందువలన మనుషులకు దేవుని జ్ఞానమును తెలియజేయుటకు దేవుడే మనిషిరూపములో భూమిమీద కనిపించి తన బోధను చెప్పిపోవును. ఆ విధముగ వచ్చిన మనిషి తాను దేవుడని ఎవరూ గుర్తుపట్టనట్లుండి జ్ఞానమును చెప్పిపోవును. దేవుడు మనిషిగ వచ్చిన సందర్భములు రెండు మాత్రము మాకు తెలిసినవి కలవు. ఆ రెండుమార్లు దేవుడు మనిషిరూపములో ఉండి చెప్పిన బోధలు చాలా గొప్పవి. అయితే ఆ గొప్పతనము ఏమిటో చాలామంది మనుషులకు అర్థము కాకుండపోయినది. దానికి కారణము దేవునిచేత తయారు చేయబడిన మాయయొక్క పనియే అని తెలియుచున్నది. మాయకు మరికొన్ని పేర్లు గలవు. సాతాన్ అనినా, సైతాన్ అనినా రెండు మాయ యొక్క పేర్లే. దేవుడు భూమిమీద తన స్వచ్ఛమైన పవిత్రమైన జ్ఞానమును చెప్పిపోతే మాయ దానిని స్వచ్ఛతలేకుండునట్లు, పవిత్రత లేకుండునట్లు, ప్రక్క మనుషుల మాటలను కలిపి దేవుని జ్ఞానమునకు విలువలేకుండ చేయు చున్నది. అదే పద్ధతి ప్రకారము భగవద్గీతలో కృష్ణుడు చెప్పిన బోధకు

మనుషుల మాటలను కలిపి కొంత అశాస్త్రీయము చేసినది. అలాగే పరిశుద్ధ బైబిలులో నాలుగు (4) భాగములు దేవుడు చెప్పిన జ్ఞానముంటే అరువది రెండు (62) భాగములు మనుషులచేత చెప్పబడిన జ్ఞానమున్నది. భగవద్గీతలో ఎవరూ గుర్తించనట్లు అక్కడక్కడ 700 శ్లోకములలో 122 శ్లోకములు మనుషులు చెప్పినవున్నవి. అందువలన భగవద్గీతకానీ, బైబిలు గానీ ఇంతవరకు చాలామందికి అర్థము కాలేదనియే చెప్పవచ్చును. దేవుని చేత చెప్పబడిన జ్ఞానములో కూడా మాయ ప్రభావము కొంత చోటు చేసుకొన్న దానివలన, మాయచేత ఆకర్షితులైన జనులు ఇటు బైబిలులోగాని అటు భగవద్గీతలోగాని మాయ మాటలనే ముఖ్య జ్ఞానముగ ఎన్నుకొనుచు, దేవుని మాటలను ప్రక్కకు త్రోయుచున్నారు. మేము ఈ విషయమును గ్రహించి మాయచేత చెప్పించబడిన మనుషుల మాటలకు విలువ ఇవ్వకుండ దేవుని మాటలకే ఎక్కువ విలువిస్తున్నాము. ఈ మా విధానము ప్రకారము భగవద్గీతలోని ఆశాస్త్రీయమైన 122 శ్లోకములను తీసివేశాము. అలాగే బైబిలులోని ఏసుప్రభువు మాటలున్న నాలుగు సువార్తలు మనిషిని తరింప జేస్తాయనీ, అంతకంటే మించిన జ్ఞానము మిగత బైబిలో లేదని చెప్పు చున్నాము. కావున నాలుగు సువార్తలు తప్ప మిగత వాటిలో అక్కడక్కడ అశాస్త్రీయత కనిపిస్తుందని చెప్పుచున్నాము. భగవద్గీతలోగానీ, బైబిలులోగానీ చాలామంది మాయతో కూడుకొన్న వాక్యములనే చెప్పుకొనుచున్నారు. వారంత నిజమైన దేవుని జ్ఞానము తెలియుటకు ఉదాహరణగ ఆదికాండము మొదటి అధ్యాయమును నమూనాగా తీసి చూపించాము. అలాగే మేము వ్రాసిన త్రైత సిద్ధాంత భగవద్గీతలో కూడా ఇవి దేవుడు చెప్పిన శ్లోకములు కాదని చెప్పి వాటిని పూర్తిగ గీతనుండి తీసివేయడము జరిగినది.

మేము క్రైస్తవులతో మాట్లాడితే నాలుగు సువార్తలలోని జ్ఞానమే మాట్లాడుతాము. హిందువులతో మాట్లాడితే భగవద్గీతలో మేము దేవుని

జ్ఞానముగా గుర్తించిన దానినే మాట్లాడుతాము. అయితే మేము మాట్లాడితే ఏ అసూయ లేకుండా క్రైస్తవులు వినగలుగుచున్నారు. చివరకు మాకు గౌరవమునిచ్చుచున్నారు. హిందువుల విషయానికి వచ్చేటప్పటికి వారు మాయవైపే ఎక్కువ మొగ్గుచూపుచూ, మేము చెప్పు జ్ఞానమును లెక్క చేయకున్నారు. భగవద్గీతకే విలువివ్వని స్థితిలో యుండి మమ్ములను కూడా అగౌరవపరచుచున్నారు. ఇక ముస్లీమ్‌ల విషయానికి వస్తే మేము చెప్పు మాటలు బాగా నచ్చినవారై సంతోషపడుచూ మమ్ములను గొప్ప భావముతో చూస్తున్నారు. మేము ఇంతవరకు క్రైస్తవమతములోను, హిందు మతములోను గల జ్ఞాన లోపములను చెప్పుచూ వచ్చాము. దేవుడు మాత్రము ఏ మతములోనైనా సరియైన బోధనే చెప్పాడు. ఖండించబడు జ్ఞానముగానీ, అశాస్త్రీయతగలిగిన జ్ఞానమునుగానీ ఎక్కడా చెప్పలేదు. దేవుడు చెప్పనిది ఏదైనా వుంటే మేమే దానిని తీసివేసి ఎవరూ ప్రక్కదారి (మాయదారి) పట్టకుండా దేవుని మార్గమునే అవలంబించునట్లు చేయు చున్నాము. దేవుని మార్గమును తెలుపు ప్రయత్నములో మాయకు సంబంధించిన మాటలను ఇటు బైబిలులోగానీ, అటు భగవద్గీతలో గానీ ఖండించి చెప్పవలసి వచ్చినదని నిజమైన జిజ్ఞాసులు అర్థము చేసుకుంటారనుకుంటున్నాను.

ఇట్లు

త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త, శతాధిక గ్రంథకర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





**"If you only knew the magnificence of the 3, 6, and 9, then you would have a key to the universe."**



**"3, 6 మరియు 9 యొక్క విశేషతను తెలుసుకొంటే విశ్వము గురించి తెలుసుకోగల అవకాశము కలదు."**

**(1)** **- నికోలా టెస్లా**






**(2)** **-ఐన్‌స్టీన్**




**(3)**

మేము ఇంతవరకు 3 6 9 అను అంకెలను ఆధ్యాత్మిక భావముతో కూడిన అర్థమును తెలియజేస్తూ వచ్చాము. ఈ చిన్న గ్రంథమును ఆరు సంవత్సరముల క్రితమే వ్రాసియుంచాము. అయితే 3 6 9 ని గురించి మిగతా శాస్త్రవేత్తలు కూడా వారి భావమును ప్రకటించి యుండడమును రెండు రోజుల క్రితమే చూచాను. గణిత శాస్త్రములో ఎంతో విజ్ఞానమును సంపాదించుకొన్న శాస్త్రవేత్తలు, పరిశోధకులు 3, 6, 9 ని గురించి వ్రాసియున్న చిత్రపటములను ఇప్పుడు మీకు చూపుటకు ప్రచురించాము. అవి అన్నియూ మేము చెప్పిన దానికి బలమును చేకూర్చునట్లుండుట వలన, వారు చెప్పిన విషయములను ప్రచురించడము జరిగినది. ఇక్కడ మొదటయున్న శాస్త్రవేత్త పేరు నికోలా టెస్లా (Nikola Tesla). ఈయన కరెంటును కనుగొన్న వ్యక్తి. ఆయన **"3, 6, 9 యొక్క విశేషతను తెలుసుకొంటే విశ్వమును గురించి తెలుసుకొను అవకాశము గలదు"** అని వ్రాసియుండడము ఖగోళశాస్త్రమునకు సంబంధించిన విషయమైనా, అది బ్రహ్మవిద్యాశాస్త్రమునకు చాలా దగ్గర సంబంధమున్నది. అలాగే ప్రపంచములో పెద్ద సైంటిస్టని పేరుగాంచిన ఐన్‌స్టీన్ (Einstein) గణిత

శాస్త్రము ప్రకారము  6-3=6 అని వ్రాసిన అంకెలను చూస్తూనే ఆధ్యాత్మికము గుర్తుకు వచ్చుచున్నది. ఇద్దరు శాస్త్రవేత్తలు వారి భావములలో ఏ అర్థముతో చెప్పినా, మా భావములో దేవుడు విశ్వములో 3, 6, 9 గా యున్నాడనీ, 3, 6, 9 నే జీవాత్మ, ఆత్మ, పరమాత్మగా చెప్పుచున్నామనీ ఈ గ్రంథములో మొదటనే చెప్పుకొన్నాము. అదే ప్రకారమే ఇప్పుడు ఈ చిత్ర పటములకు వివరమును చెప్పుకొందాము.

మొదటి చిత్రములోని శాస్త్రవేత్తను గమనించితే ఒక చేతితో వెలుగుచున్న లైటును చూపుచూ మరియొక చేతితో ఒక వ్రేలిని తలలోని మెదడువైపుకూ, మరియొక వ్రేలిని నోటివైపుకూ, మూడవ వ్రేలిని శరీరము వైపుకూ చూపుచున్నాడు. ఆ దినము ఆ వ్యక్తిలో ఆరుగాయున్న రెండవ ఆత్మ ఏ భావమును అందించినదో నాకు తెలియదుగానీ, ఇప్పుడు మనకు అవసరమైన ఆధ్యాత్మిక భావమునే నాలో ఆరుగా యున్న రెండవ ఆత్మ అందించిన విషయమునే తెలియజేస్తున్నాను. జీవమున్న శరీరమును వెలుగుచున్న బల్బుతో సమానముగా పోల్చి ఒక చేతితో చూపుచున్నాడు. వెలగని బల్బు జీవము లేని శరీరములాంటిది. ఒక బల్బు వెలగాలంటే దానికి పాజిటివ్, నెగిటివ్, ఎర్త్ అను మూడు అమరికలుంటాయి. అలాగే ఒక శరీరము సజీవము కావాలంటే దానిలోపల జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలుండాలి. ముఖ్యముగా బల్బు వెలుగుటకు పాజిటివ్, నెగిటివ్ (ధన ధృవము, ఋణధృవము) అను రెండు అమరికలున్నా మూడవ అమరిక ఎర్త్ (భూమి) అను అమరిక తప్పనిసరిగా అనుసంధానమై యుండును. దీనిని గురించి తెలియుటకు ఒక ప్లగ్ సాకెట్‌ను చూస్తే బాగా అర్థమగును.




ఒక వెలుగుచున్న బల్బును చూపిన నికోలా టెస్లా సజీవముగా యున్న శరీరములో మూడు ఆత్మలున్నవని తెల్పుచున్నాడు. అంతేకాక మూడు వ్రేళ్ళను చూపుచూ ఒక దానిని పైకి మెదడువైపుకు, రెండవ దానిని నోటి వైపుకు, మూడవ దానిని శరీరము వైపుకు చూపుచున్నాడు. ఎవరికీ తెలియకుండా ఆజ్ఞలనిచ్చు మెదడును పరమాత్మ గుర్తుగా, కదిలి పని చేయుచూ మాట్లాడు నోటిని ఆత్మగా, కొంత కాలము పెరిగి ఎప్పటికైనా నశించు శరీరమును జీవాత్మ గుర్తుగా సూచిస్తూ ఆ విధముగా ఒక వ్రేలిని పైకి, రెండవ వ్రేలిని మధ్యకు, మూడవ వ్రేలిని క్రిందివైపుకు చూపడము జరిగినది. దీనినిబట్టి వెలుగుచున్న బల్బు (దీపము) లాంటిది సజీవముగా యున్న శరీరమని చూపించునట్లు కలదు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మల విషయము తెలుసుకొంటే జీవముతో కూడుకొన్న ప్రపంచము అనగా విశ్వము యొక్క వివరము తెలియునని 3, 6, 9 ని చూపించి వీటిని గురించి తెలియగల్గితే ప్రకృతి పరమాత్మతో కూడియున్న విశ్వమును (ప్రకృతి+ఆత్మలు=విశ్వము) తెలియవచ్చునని నికోలా టెస్లా తెలిపాడు.

ఇక ఐన్‌స్టీన్ తెలిపిన విషయానికి వస్తే ఆయన 6-3=6 అని వ్రాసియున్నాడు. అలా వ్రాయడమేకాక, ఒకవైపు చేతితో 6-3ను అండర్ లైన్ చేసి (6-3 కు క్రింద గీత గీచి) చూపుచూ, మరియొక ప్రక్క నోటితో నాలుకను పూర్తి బయటికి పెట్టి చూపుచున్నాడు. ఈ దృశ్యమంతయూ

ఒక వింతగా కనిపించినా, ఆత్మ విషయములో (ఆధ్యాత్మిక విషయములో) ఎంతో జ్ఞానముతో కూడుకొన్న అర్థము గలదని ఆత్మే తెల్పుచున్నది చూడండి. మనము గ్రంథములో వ్రాసుకొన్న అర్థము ప్రకారము ఆరు (6) ఆత్మకు గుర్తుయనీ, మూడు (3) జీవాత్మకు గుర్తనీ చెప్పుకొన్నాము. సజీవ శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మయను మూడు ఆత్మలున్నా పరమాత్మ రూప, నామ, క్రియలు లేనిదై శరీరములోయున్నా అది లేనట్లే, ఎక్కడా లెక్కించబడదు. శరీరములో తెలియబడునవి ఆత్మ, జీవాత్మ అను రెండే కనుక, ఐన్‌స్టీన్ ఆరును, మూడును మాత్రమే చూపాడు. శరీరములో ఆత్మకు జీవాత్మకు రెండిటికి గుర్తుగా నాలుక గలదు. ఒక పనిని చేసినప్పుడు, ఆ పనిని జీవున్ని అయిన నేను చేసినట్లు మీకు కనిపించినా, దానిని నేను చేయలేదు, నాలోయున్న ఆత్మ చేసిందని తెలుపు నిమిత్తము, పూర్వము ఒక కార్యమును చేసిన వ్యక్తి అది తనకు సంబంధము లేదని అర్థమగునట్లు నాలుకను బయటికి పెట్టి చూపెడివారు. ప్రస్తుత కాలములో కర్మయోగ సారాంశమును తెలియజేయు నాలుకను బయటికి చూపు విధానము ఎవరికీ తెలియకుండా పోయినది. అయినా నా మాటకు సాక్ష్యము నేటికీ కొన్ని చోట్లగలదనీ, దానిప్రకారమే అమెరికా రెజ్లింగ్ కింగ్ అయిన అండర్‌టేకర్ తాను మ్యాచ్ గెలిచినప్పుడంతా గెలిచినది నేను కాదు, ఆత్మశక్తి వలననే గెలువడము జరిగినదని తెలియునట్లు, మ్యాచ్ అయిపోయిన తర్వాత మోకాళ్ళమీద కూర్చొని తన నాలుకను పూర్తి బయటికి పెట్టి చూపడము జరుగుచున్నది. మీకు అర్థము కావాలంటే ఇంటర్‌నెట్‌లో అండర్‌టేకర్ గెలిచిన మ్యాచ్‌లను చూడవచ్చును. నాలుక మనిషి అల్లాడిస్తే అల్లాడు చున్నది. అలాగే మనిషి కదిలించకున్నా కదలుచున్నది. మనిషి అనుకొన్నప్పుడు అల్లాడిస్తే అల్లాడు నాలుక, ఎటు కదిలిస్తే అటు కదలు నాలుక, మిగతా సమయములలో మనిషికి తెలియకుండా, మనిషి

ప్రమేయము లేకుండా దానంతకదే కదలుచున్నట్లు కనిపించుచున్నది. అలా మనిషి ప్రమేయము లేకుండా కదలుటకు కారణము మనకు తెలియకుండా శరీరములోనున్న ఆత్మేనని తెలియుచున్నది. ఆత్మ తన శక్తితో నాలుకను పళ్ళ మధ్యలో వేగముగా కదిలించుచూ తన శక్తికి సాక్ష్యము నిచ్చుచున్నది. అందువలన మనిషి ప్రమేయముతో కదలు నాలుక జీవాత్మకు గుర్తనీ, మనిషి ప్రమేయము లేకుండా, జీవునికి తెలియకుండా కదలు నాలుక ఆత్మకు గుర్తనీ తెలియవచ్చును. ఇటు జీవునికీ అటు ఆత్మకూ రెండిటికీ గుర్తు అయిన నాలుకను ఐన్‌స్టీన్ చూపుచూ, జీవాత్మకు, ఆత్మకు గుర్తయిన మూడు ఆరునే అండర్‌లైన్ చేసి చూపాడు. మనిషి శరీరములో జీవునికి తెలిసి పని జరిగినప్పుడు ఉపయోగపడు శక్తి ఆత్మశక్తేననీ, జీవునికి తెలియకుండా జరుగునప్పుడు కూడా ఉపయోగపడు శక్తి ఆత్మశక్తేననీ, అందరికీ తెలియునట్లు ఆత్మ గుర్తయిన ఆరులో మూడును తీసివేసినా, ఆరే వున్నదని 6-3=6 అని చూపడము జరిగినది.

ఇక మూడవ చిత్రములో తెలుపులో నల్లని గుర్తుగా మూడును, నలుపులో తెల్లని గుర్తుగా ఆరును చూపడము జరిగినది. శరీరములో జీవాత్మ (3), ఆత్మ (6) రెండూ వేరువేరుగాయున్నా రెండిటిలో పరమాత్మ కలిసి అణువణువున శరీరమంతా వ్యాపించియున్నదని తెలియునట్లు, తెలుపు నలుపు రెండు రంగులు కలిసిన లేత తెలుపు, లేత నలుపు రంగు గీతను మూడుకు ఆరుకు మధ్యలోనూ, మూడుకు ఆరుకు చుట్టూనూయున్నట్లు చూపడము జరిగినది. అలా చూపడమేకాక గీతగాయున్న నలుపు తెలుపు కలిసియున్న లేత రంగు గీతను తొమ్మిది (9)గా గుర్తించి చూపడము జరిగినది. ఆ దినము వారు ఏ భావముతో చూపినా, ఈ దినము ఆత్మ తన జ్ఞానము తెలియునట్లు ఆ బొమ్మలకు పూర్తి వివరమును ఇచ్చినది.


45°
45°
(4+5=9)


90°
90°
(9+0=9)


22.5°
22.5°
(2+2+5=9)


180°
180°
(1+8+0=9)


5.625°
5.625°
(5+6+2+5=18)
(1+8=9)


11.25°
11.25°
(1+1+2+5=9)


108°
108°
108°
108°
108°
108°
X 5
540°
(5+4+0=9)


140°
140°
140°
140°
140°
140°
140°
140°
140°
140°
X 9
1260°
(1+2+6+0=9)


135°
135°
135°
135°
135°
135°
135°
135°
135°
X 8
1080°
(1+0+8+0=9)


120°
120°
120°
120°
120°
120°
120°
X 6
720°
(7+2+0=9)


90°
90°
90°
90°
90°
X 4
360°
(3+6+0=9)


60°
60°
60°
60°
X 3
180°
(1+8+0=9)




$$144^{\circ} \times 10 = 1440^{\circ}$$

(1+4+4+0=9)

**Paradoxically,
Nine plus any digit
returns the same digit.
i.e. 9+5=14 (1+4=5)**

**The sum of all digits
excluding nine is 36.
1+2+3+4+5+6+7+8=36
(3+6=9)**

| | | |
|---|---|---|
| 1 ] 3<br>2 ] 3<br>3 — 3<br>[3, 3] 6<br>4 ] 9<br>5 ] 9<br>6 — 6<br>7 ] 6<br>8 ] 6<br>[6, 6] 3<br>[6, 9, 3] 9<br>9 — 9 | 4 ] 3<br>8 ] 3<br>12 — 3<br>[3, 3] 6<br>16 ] 9<br>20 ] 9<br>24 — 6<br>28 ] 6<br>32 ] 6<br>[6, 6] 3<br>[6, 9, 3] 9<br>36 — 9 | 7 ] 3<br>14 ] 3<br>21 — 3<br>[3, 3] 6<br>28 ] 9<br>35 ] 9<br>42 — 6<br>49 ] 6<br>56 ] 6<br>[6, 6] 3<br>[6, 9, 3] 9<br>63 — 9 |
| 8 ] 6<br>16 ] 6<br>24 — 6<br>[6, 6] 3<br>32 ] 9<br>40 ] 9<br>48 — 3<br>56 ] 3<br>64 ] 3<br>[3, 3] 6<br>[3, 9, 6] 9<br>72 — 9 | 5 ] 6<br>10 ] 6<br>15 — 6<br>[6, 6] 3<br>20 ] 9<br>25 ] 9<br>30 — 3<br>35 ] 3<br>40 ] 3<br>[3, 3] 6<br>[3, 9, 6] 9<br>45 — 9 | 2 ] 6<br>4 ] 6<br>6 — 6<br>[6, 6] 3<br>8 ] 9<br>10 ] 9<br>12 — 3<br>14 ] 3<br>16 ] 3<br>[3, 3] 6<br>[3, 9, 6] 9<br>18 — 9 |



# దేవుని గుర్తు - 963, మాయ గుర్తు - 666

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































